## లోకం-పోకడ





## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 19-12-'75
రాక్షసనామసం. మార్గశిరమాస బ. పాడ్యమి
సంపుటము : *69* సంచిక : *15*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధినగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక


అట్టమీద బొమ్మ:
కూచిపూడి నృత్య కళాకారులు
రాజా, రాధారెడ్డి

**కథలు :**

నీతి ఖరీదెంత? ... 10
రేసుగుర్రం ... 34

**సీరియల్ కథలు :**

రాదారి పడవ ... 14
(దీ.చి.సీ.క. పోటీలో బహుమతి పొందిన కథ)
శ్రావణ సంధ్య ... 21
పరిధి ... 24
(దీ.చి.సీ.క. పోటీలో బహుమతి పొందిన కథ)

**వ్యాసాలు, శీర్షికలు :**

లోకంపోకడ—4, ఉత్తరాలు, పేరుపురాని హాస్యమూర్తి—6, హైదరాబాద్ నోట్ బుక్—7, వారఫలం, రాశిఫలితాలు—13 సినిమా—19, యువతరం—26, సామాన్యుని సణుగుడు – 33, నమ్మా–నమ్మకపో–41, ఫాల్గుని డైరీ–42, డాక్టర్ సలహాలు—44, ధర్మపథం, లవ్—ఖీ—అన్నీ—45.

# మరపురాని హాస్యమూర్తి రేలంగి



'రాజులుసైన్యంతోను, కవులు కవనం తోను రేలంగి హాస్యంతోను గెలుస్తారు.' [26–4–1963 ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని తెరమీద తెర వెనుకలో రేలంగి పరిచయంలోని తొలి వాక్యమిది] నిజమేగాని రాజుల గెలుపులో రక్తపాతానికి, కవుల వాక్చాతుర్యంలో స్వోత్కర్షకి పర నిందకి అవకాశాలున్నాయిగాని రేలంగి ఏలిన చిత్ర సీమలో అతను ఎప్పుడు పంచినా నవ్వుల పంటయే పంచాడు. అతను నలభై సంవత్సరాల పాటు "మజా మజా" మధురసం అంటే తన హాస్యం మాత్రం అందించి అమరజీవి అయినాడు.

జర్నలిస్టులు అతన్ని ఏనుగు ఎక్కించారు. హీరోయిన్‌లు అతనికి సన్మానం చేసి హారతులు పట్టారు. "హాస్య మాంత్రికుడ"ని గ్రహించిననిర్మాతలతను లేకుండా సినిమాలు తీయడానికి జంకేవారు. గవర్నమెంటువారు 'పద్మశ్రీ' అవార్డు యిచ్చేనాటికి అతను[1970] తెనుగువాడి హృదయాన్ని పూర్తిగా దోచుకున్నాడు "నక్షతకుడు" "నారదుడు" "తలారి రాముడు" "పోలీసు కానిస్టేబిల్ నెం. 441" 'రెండు చింతలు' 'రాజగారి బామ్మర్ది' "బడిపంతులు" "ప్లీడరు" ఏ వేషం కట్టినా ఆ పాత్రలో హాస్య గుణం పుట్టించి అందర్నీ ఆనంద పరిచిన రేలంగికి రేలంగియే సాటి!

తాడేపల్లిగూడెంలో అరవై అయిదో ఏట అంతిమ శ్వాస తీసుకున్న రేలంగి నిప్పులాంటి మనిషి శత దినోత్సవంలో పాల్గొన్నాడు. అదే అతని శత దినోత్సవ చిత్ర పరంపరల జైత్రయాత్రలో చివరి పబ్లిక్ అప్పియరెన్స్ అనుకుంటాను — అనాడుకూడా అతను హాస్య కరుణరసాలనే ప్రేక్షకులకు పంచిపెట్టాడు.

రేలంగి ఒక నటునిగా అందుకోవలసిన అత్యున్నత శిఖరాల నందుకున్నాడు. అందరి మన్నన పొంది తరువాతి తరంవారికి ఆదర్శప్రాయుడైనాడు తెనుగువాడు గర్వంగా ప్రపంచానికి చాటి చెప్పుకోగల మహానటులలో రేలంగిపేరు చిరస్థాయిగా వుంటుంది. సందేహం లేదు. [వీరాజీ]

# ఉత్తరాలు

### అట్టమీద బొమ్మ

'రిషి కపూర్' ముఖచిత్రం ఆ వారం పత్రికకు ప్రత్యేకమైన ఆకర్షణ. రెండు కథలు చాలా బావున్నాయి. కాని 'పెళ్లినాడు' కథ మార్చి నెల చివరి వారంలో ప్రచురిస్తే ఇంకా బాగుండేది.

నమ్మా నమ్మకపోలో నూరు సం. ల లింకన్, కెనెడీల తేడాను మేము మాత్రం నమ్మలేకపోయామండి, కె. రామలక్ష్మి 'ప్రశ్నావళి' ఆయుర్వేద మందులను ప్రమింగుతున్నట్లుగా కరిన కఠోరంగా ఉన్నాయి.

కొప్పుల ప్రకాష్ రెడ్డి, చెర్లకోల క్రిష్నారెడ్డి (పర్సాయపల్లి)

* * *

జయశ్రీ టి. ముఖచిత్రంలో వెలువడిన వారం(28.11.1975) పత్రిక దిష్టి తగిలేలా ఉంది. లాంగ్ లివ్ పత్రిక.

కుమారస్వామి. (చిత్రదుర్గం.)

### కథలు

నటి జయశ్రీ ముఖచిత్రంలో వెలువడిన పత్రికలోని కథలు రెండే అయినప్పటికిని ఆ రెండు కథలూ బాగున్నవి. దేనికవే సాటి. బ్లాక్ మెయిల్ కథ చాలా సస్పెన్సుగా ఉన్నది. ఈ కథ బాగున్నప్పటికి ఒకలోపం ఉన్నది. ఈ కథలో ప్రభాకర్ వచ్చి ఇందిరను బెదిరించే సమయంలో రవీంద్ర రావడం ఇదంతా జరగాక హటాత్తుగా ఇందిరను రవీంద్రఎందుకు కొట్టాడో మాకు అర్థం కాలేదు. ఇది ఇలా ఉన్నప్పటికీ కథ నడిచినతీరు మాకెంతో నచ్చినది పరిష్కారం కథ మధ్యలో ఆపి మమ్మల్ని సస్పెన్స్‌లో ముంచారు.

కాచం రఘువీర్, (పర్కాల.)

* * *

ఎంత చదివినా ఎదుగు బొదుగూ లేని సంసారాన్ని గుర్తుచేస్తూ వ్రాసిన "కుక్క తోక" కథ చాలా బాగున్నది.

అత్తిలి వెంకట్రావు, లక్ష్మి. (జట్ని)

### సీరియల్

'గెలుపు నాదే' సీరియల్ చాలా బాగా ముగిసింది. ఆ సీరియల్ అయిపోయిన తరువాత పత్రిక చదువుదామనే ఇంట్రస్ట్ కలగటములేదు. మంచి సీరియల్స్ వేయగలరని ఆశిస్తూ ఉంటాము పేజీలు మరీ తగ్గించేస్తున్నారు. "సామాన్యుని సణుగుడు" సాధ్యమయినంత వరకు ప్రతీ వారము వేయుమని కోరుతున్నాము

ఎన్. సి. రమాదేవి, సరోజ, (చిత్తూరు)

### సినిమా

ఇది చాలా అన్యాయం సార్! మణిపాల్‌లో షుమారుగా 250 మంది తెలుగు విద్యార్థులు వున్నారు. ఉడిపికి (3 కి. మీ. ఇక్కడకు)పత్రిక 6 కాపీలు మాత్రమే వస్తాయి. శుక్రవారంఅయ్యే సరికి విద్యార్థులు కొట్టుమీదకు దండెత్తుతారు. నిముషంలో అయిపోతాయి. ఇక మిగిలిన వారి సంగతి. .??. మీరు నమ్మరు, దీనికోసంక్లాసులు మానేసిన విద్యార్థులు వున్నారు. ఇంత అందంగా పత్రికను నడపటం చాలా అన్యాయం సార్!! ఇంతకూ మా అందరికి నచ్చే శీర్షిక ఏమిటనుకుంటున్నారు. . . "సినిమా".

టి. వి. వి. రామారావు, అప్పారావు, (మణిపాల్— కర్నాటక)

### కార్టూన్‌లు

5.12.75 సంచికలోని "పుల్లారావ్" గారి హాస్య కార్టూన్ కడుపుబ్బ నవ్వించింది.

ముళ్లపూడి నరసింహమూర్తి (ఏటికొప్పాక)

(45వ పేజీ చూడండి)

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## హ్యూమానిటేరియన్ యూత్స్ అసోసియేషన్

మానవసేవే మాధవసేవ అనే ఏకైక లక్ష్యంతో 1972 లో ఏర్పడి హ్యూమానిటేరియన్ యూత్స్ అసోసియేషన్ చేస్తున్న సేవను చూస్తున్నప్పుడు నేటి యువకులంతా జీవికకోసం ఎగబాకేవారుకారని, జీవికతోపాటు మానవసేవా లక్ష్యంతో ముందుకుపోతున్న వారూ ఉన్నారని స్పష్టమవుతుంది. ఈ సంఘం ఉత్సాహంతో ఉబికే, ఆ ఉబుకుతో కృషికి కంకణంకట్టే, ఆ కంకణంతో పలువురు ఆర్తులకు సేవచేసే యువజన బృందం. ఈ యువకులు గ్రామసీమలలోను, పట్టణపు శివారుల లోను ఉన్న బీదలకు ఉచితంగా వైద్య సౌకర్యం కలిగించి మందులు ఉచితంగా పంచిపెడుతున్నారు. వరాసీగూడలోను, ఖైరతాబాదులోను చెరిఒక హోమియోపతి ఔషధాలయం నెలకొల్పారు. తరచు ఆరోగ్యం గురించి ప్రముఖ వైద్యులచే ప్రసంగాలు ఇప్పిస్తున్నారు రోగ నిదానం, పరీక్షలు జరిపిస్తున్నారు. (2) వేసవిలో సికిందరాబాద్‌లోని కొన్ని ప్రాంతాలలో చలివేంద్రాలు ఏర్పాటుచేసి, దప్పిగొన్నవారికి దప్పి తీరుస్తున్నారు. అన్నదానం చేస్తున్నారు అనాథ శరణాలయాలకు వెళ్లి అక్కడివారికి గుడ్డలు, మిఠాయిలు పంచిపెడుతున్నారు. (3) విద్యారంగంలో సంస్కృతం, హోమియోపతి, 7 వ తరగతి, మెట్రిక్, ఎల్. ఎం. ఇ. వంటి సాంకేతిక పరీక్షల కోర్సులకు ఉచిత శిక్షణయిస్తున్నారు. వ్యాసరచన నేర్పడం, అంతర కళాశాలల, పాఠశాలల సారస్వత సంఘాలు నెలకొల్పడం, వాగ్వివాద, ఉపన్యాస స్పర్ధలు నడపడంవంటివి చెస్తున్నారు. (4) గ్రామ ప్రాంతాలకు వెళ్లి, గ్రామ ప్రజలకు ఆరోగ్య విషయాలు, జీవిత విధానాలు వివరించే శిబిరాలు ఏర్పాటు చేస్తున్నారు. (5) పండుగల సమయంలో ఆటల పోటీలు ఏర్పాటు చేస్తున్నారు. వివిధ శాఖల, వివిధ ప్రాంతాల క్షేత్ర ప్రచార శాఖల సమయంలో వార్తా చిత్రాలు ప్రదర్శించడం, కదంబ కార్యక్రమం క్రింద రేడియో కార్యక్రమాలు, అనుకరణ ప్రదర్శనం, ఏకపాత్రాభినయం, జాతీయ గీతాల ప్రదర్శనం మొదలయినవి ఏర్పాటు చేస్తున్నారు. నేత్ర దానంకోసం ప్రచారం చేస్తున్నారు. ఈ సంఘం నిర్వహించిన ఆరోగ్య శిబిరాలలో డాక్టరు ఎస్. వి. ఆర్. స్వామి, డాక్టర్ శాంతి నారాయణ్ మాథుర్‌వంటివారు పాల్గొన్నారు. ఈ సంఘం. ఆల్వాల్ మొదలైన ప్రాంతాలలో బీద పిల్లలకు నోటుబుక్కులు, పెన్సిళ్లు మొదలైనవి పంచిపెట్టింది. ఈ సంఘం నిర్వహించిన సంగీత ప్రదర్శనలలో కుమారి ఛాయాదేవివంటి ప్రముఖ గాయనీమణులు పాల్గొన్నారు. ఈ సంవత్సరం ఆరేడు అన్నదానాలు జరిపింది. మహోత్సాహంలో మానవ సేవ చేస్తున్న ఈ సంఘంలో శ్రీ గోపాల్‌రావునాయుడు, డాక్టర్ దామోదర్ రావు, డాక్టర్ పి. జి. లాల్యేవంటి ప్రముఖులున్నారు. ఈ సంఘం శ్రీ కె. ఎం. జాకబ్ అధ్యక్షులుగా, శ్రీ ఆర్. సత్యనారాయణ కార్యదర్శిగా, మహోభ్యుదయం సాధిస్తున్నది: నెల నెలా తన సేవా కార్యక్రమం గురించిన బులెటిన్ ప్రచురిస్తున్నది. ప్రజలు దీనిసేవను గుర్తిస్తున్నారు.

## ఎన్. సి. సి. ల శ్రమదానం :

జంటనగరాల సౌందర్యానికి ప్రకృతి పట్టే అద్దంవంటి హుసేన్ సాగర్‌లో ఇటీవల భుగంధ పుష్పం అనే ఒక కలుపు మొక్క వ్యాపించి తటాక సౌందర్యాన్నంతా పాడుచేస్తుండడం సౌందర్యోపాసకులకు ఎవరికైనా కష్టదాయకంగానే వున్న విషయం ఆ కష్టం ఎన్. సి. సి. యువకుల శ్రమదానం పుణ్యమా అని నవంబరు 23 న తొలగి హుసేన్‌సాగర్ మరల తన సహజ సౌందర్యాన్ని సంతరించుకొని, ట్యాంక్‌బండ్ విహారులకు సంతోషం కలిగిస్తున్నది. ఎప్పటిలాగా. ఈ పనిని హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ తలపెట్టింది. వేయిమంది ఎన్. సి. సి. యువకులు నడుములోతు నీటిలోదిగి ఈ కలుపు మొక్కలు సమూలంగా పీకివేశారు. వీరికి మునిసిపల్ కార్యకర్తలుతోడ్పడ్డారు. గవర్నర్ శ్రీ మోహనలాల్‌రెడ్డి ఈయువకుల శ్రమదానం చూచి ప్రశంసించారు. ఎన్ సి. సి. దళనాయకులు లెఫ్టినెంట్ కర్నల్ చౌధురీ, కెప్టెన్ ఘులాం దస్తగిర్, పి ఎస్. శర్మ, పి. వి. వి. ఎస్. మూర్తి, సునీల్ కుమార్‌నాయక్ కుమారి

# హైదరాబాద్ నోట్ బుక్

సుహాసినీ ప్రవేశాదిని, మునిసిపల్ అధికారులు, ఎన్. సి. సి. యువకులు ప్రశంసనీయులు ఈ మొక్క భుగంధ పుష్ప (హియాసింత్) పూర్వపు గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ భార్య బ్రాజిల్‌నుంచి 1709లో భారత దేశానికి తెచ్చిందని అంటారు. హైదరాబాదుకు ఇది 1900 ప్రాంతంలో వచ్చిందట, కొలనులో అందంకోసం, కాని ఇది మహామారిగా వ్యాపించింది.

**మహాపురుషుని సంస్మరణ :**

తెలుగువారి అభ్యున్నతికి తమ రచనలతో, సేవలతో, బోధనలతో జీవితమంతా కృషిచేసి, ఎవరినుంచి, ఏ సంఘంనుంచి ఏమీకోరకనే అపరిగ్రహవ్రతంతో జీవితం గడిపిన మహామహుడు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి సంస్మరణదినాన్ని నవంబరు24 వ తేదీన సారస్వత పరిషత్తు ఆవరణలో ఏర్పాటు చేసిన సాహిత్య అకాడెమీని అభినందించక తప్పదు, నిజమైన సేవ చేసిన వ్యక్తుల గుణగణ కీర్తనం ఇటీవల కరవైనందున వీరభద్రరావుగారి సంస్మరణ సారస్వత, సంస్కృతి ప్రేమికులను ఎంతగానో సంతృప్తి పరచింది గనుక శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగత వచనాలు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, అధ్యక్ష వచనాలు తర్వాత, శ్రీ గడియారం రామకృష్ణశర్మ వీరభద్రరావుగారి జీవిత విశేషాలను గురించి, డాక్టర్ బి. రామరాజు వీరభద్రరావుగారి రచనలు, పరిశోధనను గురించి ప్రసంగించారు. ఈ ప్రసంగాలను అకాడెమీ పుస్తకరూపంగా ప్రచురిస్తుంది. డాక్టర్ బోయి భీమన్న కృతజ్ఞతతో సంస్మరణ సభ సమాప్తమైంది.

**బాలానందం వార్షికోత్సవం :**

హైదరాబాద్ బాలానంద సంఘం 19 వ వార్షికోత్సవం నవంబరు మూడవవారంలో రవీంద్ర భారతిలో జరిగినప్పుడు, ప్రధాన అతిథి ప్రముఖ చలన చిత్రతార శ్రీమతి జమునా రమణారావు చేసిన సూచనలు పిల్లల తలిదండ్రులు పాటించడం అవసరం. పిల్లలలో అంతర్లీనంగా వున్న శక్తులను పైకితెచ్చి అభివృద్ధి పరచడం అవసరమని ఆమె అన్నారు. శ్రీ న్యాపతి కామేశ్వరరావు, శ్రీమతి కామేశ్వరి గార్లు బాలానందం స్థాపించి, పిల్లల మనోవికాసానికి చేస్తున్న సేవను ఆమె ప్రశంసించారు. ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ గోరాశాస్త్రి ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ, దానిలోని బాలల రచనలను ప్రశంసించారు. బాలలు రెండు నాటికలను ప్రదర్శించారు. వాటిలో "కాసులపేరు" నాటిక ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించింది

**ఉపశ్రుతి :**

"అస్సాం ముఖ్యమంత్రి ఒక ఉత్తరువువేశారట మంత్రులకు, చదివారా ?" అన్నాడు ఒక పెద్ద మనిషి "ఆ చదివాను మంత్రులు, నెలలో కనీసం 200 గంటలు (దాదాపు ఎనిమిదిన్నర రోజులు) కార్యాలయాలలో వుండాలనే కదా!" అన్నాను. "ఆ! అదే. దానిని మన ప్రభుత్వమూ కొన్ని కార్యాలయాలలోని ఆఫీసర్లకు వర్తింప జేసినా బాగుండును టూర్లు తగ్గించి" అన్నాడు అతడు. ●

## గూడు

నువ్వూ – నిజం – కలిసినా
న్యాయంకాదు.
నవ్వూ–నువ్వూ–కలిసినా స్వర్గంకాదు.
నీతికి నిలకడలేదు.
నిజాయితీ కలిసిరాదు.
అబద్ధం ఆడలేదు–నక్కి అడిస్తుంది.
అధర్మం చూడలేదు – కనపడకుండా
మాట్లాడుతుంది.
ఆశ మాట్లాడదు – మౌనంగా
కవ్విస్తుంది
స్వార్థం కనిపించదు–అడుగులో అడుగు
వేస్తుంది.

నువ్వూ–సానుభూతీ–దయకాదు
పిరికితనం అంటోంది – దగా
నువ్వూ–ఆదరణా ప్రేమకాదు
పచ్చి వాంఛ అంటోంది – పగ
మనసు – మనిషి వేరైతే
మిగిలేది ఎముకల గూడు
మంచి – చెడూ ఎదురు తిరిగితే
మిగిలేది హిరోషిమా నాగాసాకి వంటి
ఎండిన గూడు !!

*డా॥ సాయిరమేష్*

# దగ్గులను కొట్టిపడవేయు ఛాంపియన్

Alembic




**గ్లైకోడిన్** వలె దగ్గులను కొట్టిపడవేయగల గృహవైద్యం మరొకటి లేదు. దగ్గులను 4 స్థలాలలో— అనగా మెదడు, గొంతు, రొమ్ము, ఊపిరితిత్తులలో— ఎదుర్కొని శీఘ్రమే ఉపశమనాన్ని యిస్తుంది • ఇది త్వరగా పనిచేస్తుంది • రుచికి మధురం • మరియు పొదుపు.

గ్లైకోడిన్ — లక్షలాది ప్రజలు 40 ఏళ్లుగా నమ్ముకొన్నది.

everest/617/ACW-?

జీతం తీసుకున్నాడు శివరాం.

అన్నీ కొత్తనోట్లే. హుషారుగా, చకచకా లెక్కపెట్టుకున్నాడు. లెక్కపెట్టుకుని చటుక్కున జేబులో కుక్కుకుని బయటికొచ్చాడు.

ఒకవైపు సంతోషం ... మరోవైపు భయం...సందిగ్ధత-సిగరెట్టు వెలిగించుకుని విలాసంగా పొగను గాలిలోకి వదలి సైకిల్ షెడ్‌దిక్కు నడిచాడు.

తలనిండా కూడికలూ, తీసివేతలూ, గుణకారాలూ-పద్దులూ కదులుతున్నాయి.

పాలవాడూ, పూలవాడూ, శెట్టి అందరూ వినయంగా చేతులు జోడించి నమస్కరిస్తున్నారు మనసులో.

ఈ నమస్కారాలక్రింద జప్తయిపోయి శేషంగా నున్న మిగిలిన 'ఫస్ట్'తారీఖులు ఎన్నో ఉన్నాయి శివరాం ఏడేళ్ళ గుమాస్తా సర్వీస్‌లో.

ఈ దేశంలో గుమాస్తాగా బ్రతకడం కంటే ఎక్కడో కీకారణ్యంలో శిలగా ఉండిపోవడం ఎంతో సుఖమని శివరాం ఎన్నోసార్లనుకున్నాడు. 'అతని ముఖమెప్పుడైనా ఫస్ట్‌నాడు 'పే' కౌంటర్‌లో మల్లెపూవులా విచ్చుకుని మర్నాడుదయం పాలవాడి కేకతో గాలిపోయిన బుడగలా ముడుచుకుపోతుంది.

"ఫస్ట్ దాటిందా-ఇహ మిగతా ఇరవైతొమ్మిది రోజులూ గాడిద పళ్ళు తోమినట్లు ఒట్టి దేబ్రాసి బ్రతుకు. మళ్ళీ ఫస్ట్‌గురించి ఎదురుచూపు...ఛీ ఛీ...వెధవ బ్రతుకు... వెధవ బ్రతుకు-' శివరాం డొక్కు సైకిల్ మీద ఎంతో కళాత్మకంగా కూర్చుని ఓపిగ్గా వస్తున్నాడు.

కాని ఈ పస్ అలా ఫిలమెంట్ రాలి



రామాచంద్రమౌళి

# [illegible]

# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం మీ పైర్లకు అవసరం

# విజయ్



పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి పైర్లకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదా అని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...పైరు మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తిని కూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని రుజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే పెట్టుబడి ఖర్చు రూ. | నికర రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1500 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 2176 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1305 | 2400 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 225/–. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక్క నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 900/- ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లైయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు.

విజయ్ 17-17-17 లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్ళలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0.

విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

విజయ్ ఎరువులనువాడండి — అధిక లాభాలను పొందండి.




విజయ్ ఎరువులను గూర్చి విపులంగా తెలుసుకోవాలంటే యీక్రింది చిరునామాకు వ్రాయండి. తగిన సలహాలను, కరపత్రాలను ఉచితంగా మీకు అందజేస్తారు.

ఏరియా మేనేజర్,
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ
హైదరాబాద్-500 028



## నీతి ఖరీదెంత ?

పోయిన బల్బ్‌లా ఉంటానికి వీల్లేదు...వీల్లేదంటె వీల్లేదు-అంతే.

ఈసారి జీతంలో ఎక్కువగా...ఓ కొత్త నూరు రూపాయలనోటు-ష్...చప్పుడు జేయకుండా మజా ఉడాయించాలంతే.

చౌరస్తాలో సైకిలాపి హుటాహుటిని ఓ పూలపొట్లమూ, ఓ మిఠాయి ప్యాకెటూ, తీసుకుని 'కీ' యిచ్చిన బొమ్మలా మళ్ళీ డొక్కు సైకిలెక్కి వెరీ అర్జంటుగా బాణంలా దూసుకుపోయాడు.

గుమ్మంలోనే ఎదురైన పిల్లలవంక మిఠాయి పొట్లాన్ని విసిరేసి నోళ్ళుమూయించి చకచకా పొయితో, మండని కట్టెలతో సతమతమౌతున్న పెళ్ళాం దగ్గిరికెళ్ళి మండని కట్టెలను ఆర్పించి మసిముఖాన్ని కడుక్కోమని చేతిలో పూలదండను పెట్టి—"ఒరే... పిలలూ పెద్దలూ మనమందరమూ ఇప్పుడు సర్కస్ చూడబోతున్నాంరా ... గబగబా తయారుకండా" అని ఓ బ్రహ్మాండమైన ప్రకటన చేశాడు.

శివరాం పెళ్ళాం అతని ప్రకటన విని ముందు ఆశ్చర్యపోయి తర్వాత భయపడ్డది. పడి "ఇప్పుడే సర్కస్ ప్రోగ్రామెందుకండీ... అసలే ఈ నెలలో ఎన్నో పండుగలున్నాయి. బిల్లు ఎంతో ఎక్కువై కూర్చుంది. లోటు బడ్జెట్‌ను భర్తీ చేసేందుకు ఎవరికిలోన్ దరఖాస్తు పెట్టుకుందామా అనుకుంటూంటే ఈ ఖర్చెందుకు చెప్పండి" అంది ఎంతో ప్రశాంతంగా సతీ అనసూయగారి పోజులో.

ఊహుఁ...ససేమిరా వీల్లేదన్నాడు శివరాం.

ఆరు నూరైనా...'నూరు' మరింకేమైనా తామందరూ కుటుంబ సమేతముగా శాంతచిత్తులై సర్కస్‌ను చూడవలసిందే అని కూడా అన్నాడు.

హైస్కూల్ కుర్రాడికి పోస్టుగ్రాడ్యుయేట్ పుస్తకం అర్ధంకానట్టు శివరాం పెళ్ళానికి అతని ధైర్యం అస్సలే అర్థం కాలేదు. ఎప్పుడూ మొదటినాడు మొగం వ్రేలాడేసుకుని వచ్చి ఖర్చుల పట్టీని ముందేసుకుని విషాదాభినయం చేసేమనిషికి ఇప్పుడింత హుషారేమిటి చెప్మా అనుకుని ఇహ ఎలావచ్చినా ఆర్డినెన్స్ జారీఐంది కాబట్టి తప్పేదిలేక సర్కస్‌కు తయారైంది.

సర్కస్‌లో 'ఫీట్స్' చూస్తున్నంతసేపూ శివరాం శిలలా ఉండిపోయాడు మౌనంగా.

పిల్లలు జంతువులను చూచి గంతులేస్తున్నారు. గంతులేస్తున్న పిల్లలను చూచి పిల్లలతల్లి బంగారం దొరికినంత సంతోషపడింది.

జీతం—

కొత్త నూర్రూపాయలనోటు...

గుమాస్తా బ్రతుకు...గాడిద బ్రతుకు.

బ్రతుకుమీద అసహ్యం...విసుగు...కసి.

జీవితాంతం తనను అర్జాకలితో చావమని శపించి వికటంగా నవ్వుతున్న తన డిగ్రీ సర్టిఫికేట్.

సర్కస్ బోనులో జంతువైపోయాడు తను...ఛీఛీ.

కొత్త నూర్రూపాయల నోటు...జీతం జీతం...జీతం.

"అలా గంభీరంగా ఉన్నారేమిటండీ... పిల్లలను చూడండి ఎంత సంతోషపడిపోతున్నారో."

పెళ్ళాం ముఖంలోకి చూచి చిన్నగా,



మనవాడి శృంగార చేష్టల పిచ్చి బాగా ముదిరిందిరోయ్ !

లోతుగా, యోగిలా నవ్వాడు శివరాం.

* * *

"ప్రిన్స్‌పాల్‌గారు రమ్మంటున్నారు సార్ మిమ్మల్ని" ప్యూన్.

ఫైళ్ల సముద్రంలోంచి తలెత్తి చూశాడు శివరాం. ప్యూన్ యమదూతలా కనిపించి ఎముకల్లో నుండి వణుకు ప్రారంభమైంది.

"వస్తున్నా"

బంట్రోతు వెళ్లిపోయాడు.

ప్రిన్స్‌పాల్ పిలుస్తున్నాడా ... ఎందుకు ...ఎందుకు పిలుస్తున్నాడు.

నిన్నటి నూర్రూపాయలు ... నూర్రూపాయలు

శివరాం ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి.

వెళ్లాడు గదిలోకి వణుకుతూ.

"మిస్టర్ శివరాం ... కమాన్ ... కూర్చోండి" ప్రిన్స్‌పాల్ ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు. అప్పటికే అక్కడ నలుగురు స్టాఫ్ మెంబర్స్ కూర్చున్నారు.

పిట్టలకోసం నేర్పుగా వలవేసి నవ్వుతూ కూర్చున్న వేటగాని ముఖంలా ఉంది ప్రిన్స్‌పాల్ ముఖం.

నవ్వుతూనే ఓ టైప్ చేసిన కాగితాన్నందించాడు ప్రిన్స్‌పాల్.

'ఏమిటి...ఏమిటి' శివరాం కళ్లల్లో వణుకు వరదలా ముంచుకొస్తున్నది.

"నిన్న మీకు జీతమిచ్చేప్పుడు ముందుగానే వీళ్లందరి సాక్ష్యం తీసుకుని ఓ నూర్రూపాయల నోటును ఎక్కువిప్పించాను. అప్పుడు నోట్లను లెక్కపెట్టుకోగానే ఆ ఎక్కువున్న డబ్బును నిజాయితీగా తిరిగిచ్చేయాల్సింది. మీరలా చేయలేదు. ఎలాగూ వచ్చింది గదా అని నూర్రూపాయలను పట్టుకెళ్లారు. ఇవ్వాళకూడా దాని గురించి మీరేమీ చేయలేదు...మిస్టర్ శివరాం ఐవాంట్ సిన్సియర్ పీపుల్ హియర్ - యువార్ సస్పెండెడ్-"

శివరాం మనసులో నూర్రూపాయల నోటు ఆకాశమంత నోటితో నవ్వుతోంది వికృతంగా.

ఎదురుగా అంతా చీకటి...చీకటి.

అతని చెవుల్లో నోళ్లను పెట్టి దురాశా, ఆపేక్షా, దుర్బుద్ధి అన్నీ పిశాచాల్లా నవ్వుతున్నాయి.

సిగ్గుతో కళ్లు మూసుకున్నాడు శివరాం.

# వారఫలం

మహేష్

## 19–12–1975 శుక్రవారం మొదలు 25–12–1975 గురువారం వరకు

**మేషం:—** వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఇతరులకు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం:—** ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మిధునం:—** మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మిత్రులకుసహాయంచేస్తారు. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కర్కాటకం:—** మీ ప్రయాణాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం :—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఫలితంలేని శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు—కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

## రాలిన ముత్యాలు

.......శ్రీ సోమసుందర్.......

ఇరుకు గదుల నడుమ ఇరులలో మగ్గేటి
బడుగు బానిసీళ్ల బ్రతుకులెల్ల
కడిగి స్మేరకాంతి కల్పించి మెరిపించి
నరుల తీర్చిదిద్దినాడు బాపు!

**తుల:—** రావలసిన డబ్బు అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులసహాయం లభిస్తుంది. స్త్రీలకు— సంతోషకరమైనవార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసివస్తుంది స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ధనుస్సు :—** భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగాఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు ఏర్పడతాయి.

**మకరం :—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు నెరవేరతాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం :—** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. వారం ఆఖరులో రావలసిన డబ్బు అందుతుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**మీనం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయంచేస్తారు.★

ఎనిమిది కావస్తుండగా ఆ పల్లెలోకి అడుగు పెట్టాడు సుబ్బారావు. ఊళ్ళోకి అడుగిడుతూనే ఇల్లు ఎలా కనుక్కోవటమా అన్న సందిగ్ధంలోపడ్డాడు. ఆలోచిస్తూ నడుస్తున్న అతడికి ఒక యింటిముందు వాలు కుర్చీలో ఒరిగి హాయిగా చుట్ట పీల్చుకుంటున్న పెద్ద మనిషి కనిపించాడు.

"నమస్కారమండీ" అతడి దగ్గరగా వెళ్ళి అన్నాడు సుబ్బారావు.

"నమస్కారం. ఎవరు బాబూ నువ్వు" ఆ ఊళ్ళో తనకు తెలియని మొఖం ఎప్పుడొచ్చిందా అని ఆలోచిస్తున్నాడాయన.

"నేనీ వూరికి కొత్తవాణ్ణండీ. నా పేరు సుబ్బారావు. మీ పేరు తెలుసుకోవచ్చునా ?" వినయంగా అన్నాడు.

ఒకసారి ఆయన సుబ్బారావు వంక పరీక్షగా చూశాడు.

"అలా కూచోవోయ్" స్టూల్ వంక చూపిస్తూ అన్నాడు.

సుబ్బారావు కూచున్నాడు.

"నా పేరు రాఘవయ్య. నువ్వు ఎవరింటి కొచ్చావు ?"

"ప్రభాకర్ అని ఒక అబ్బాయి; నా స్నేహితుడండీ. అతడి ఊరు దొండపాడు అని మాత్రం తెలుసు నాకు"

"ప్రభాకరంటే పరంధామయ్య పెద్దబ్బాయన్నమాట" అనుకుంటున్నట్లుగా అంటూ, "పోలయ్యా" కేకేశాడు.

"ఈ అబ్బాయికి పరంధామయ్య యిల్లు చూపించు" అన్నాడు, వచ్చిన పోలయ్యతో.

తేలిగ్గా యింట్లో వాళ్ళతో తనను తాను ప్రభాకర్ స్నేహితుడి స్నేహితుడిగా పరిచయం చేసుకుని, వాళ్ళిచ్చిన కాఫీ తాగి, అతనిని బయటికి తీసికెళ్ళాడు.

"వెంకట్రావ్‌గారు మీ మామయ్యగారనుకుంటాను" ప్రభాకర్ ముఖ కవళికలు ఓరగా చూస్తూ అన్నాడు సుబ్బారావు.

అతడి ముఖం మాడిపోయింది.

"అవునండీ ఆయన మీకెలా తెలుసు" ఆతురతగా అన్నాడు.

"వారింటి దగ్గరే నేనుండేది. మొన్ననే వాళ్ళమ్మాయి పెళ్ళి జరిగింది. పెళ్ళికి మీరు రాలేదనుకుంటాను." సుబ్బారావులోని 'రచయిత బుర్ర' బాగా పని చేస్తోంది.

"అవునండీ. రెండు మూడేళ్ళ కింద

## బ్యాలట్‌కై వేస్తున్న కథ




*[గత సంచిక తరువాయి]*

వాళ్ళకూ మాకూ తగదాలొచ్చాయి." బాధగా అన్నాడు ప్రభాకర్.

"అయినా, ఆ అమ్మాయి మీకు వరుసనుకుంటాను. ఎంత తగాదాలయినా మేనరికం పోగొట్టుకోవటం బాగాలేదు."

"నిజానికి ఆ అమ్మాయికి ... " ఏదో అనబోతూ ఆగిపోయాడతడు.

*జరిగిన కథ 3 :* సుబ్బారావు ప్లీడరు గుమాస్తాయే అయినా పేరున్న రచయిత. పెళ్ళాం పరాయి మగాడితో సంబంధం పెట్టుకోటానికి మొగుడు కూడా కారకుడే కాబట్టి అతను ఆమెని శిక్షించటం నేరమనే సుబ్బారావు మనస్తత్వం భార్య ప్రసూనను ఆశ్చర్యపరుస్తుంది. తనతో తృప్తిపొందలేక చిన్ననాడు కలిసి చదువుకొన్న సూర్యనారాయణతో సంబంధం పెట్టుకున్న ప్రసూనకు విడాకులిచ్చి అతనితోనే వివాహం జరిపిస్తాడు సుబ్బారావు. స్నేహితుడు శ్రీనివాస్, ప్రసూనల బలవంతంమీద సుబ్బారావు కుసుమను వివాహం చేసుకుంటాడు. కుసుమకు ప్రభాకరం రాసిన వుత్తరం చదివిన సుబ్బారావు, ప్రభాకరం కుసుమలు పెళ్ళి చేసుకోవాలనుకున్నారని, అందువల్లే కుసుమ తనకు దూరంగా వుంటోందని తెలుసుకుంటాడు.

సుబ్బారావు అర్థం చేసుకున్నాడు.

"ఫర్వాలేదు, చెప్పండి. ఒకరి మాటలు మరొకరికి చెప్పటం నా కలవాటులేదు" అన్నాడు.

"క్షమించండి. ఒక్కోసారి అనవసరమైన మాటలు, జీవితాలను నాశనం చేస్తాయి. అదే నాభయం" అంటూ, వాళ్ల కుటుంబాల మధ్య తగాదాలకు కారణం, కుసుమ పట్ల తనకున్న అనురాగం—అన్నీ చెప్పేశాడు అతడు.

"అంటే, జరిగిన పెళ్ళి ఆ అమ్మాయికి యిష్టం లేదన్నమాట."

"అవునండీ. కానీ అంతకన్న చేయగలిగిందేమీ కన్పించలేదు."

"మీరు చాలా పొరపాటు పని చేశారు. ఎలాగో రహస్యంగా ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుని వుండాల్సింది."

"నిజమే నేనూ అదే అనుకుంటాను. కానీ చేతులు కాలినాక ఆకులు పట్టుకుని ప్రయోజనం ?" నిట్టూర్పు విడిచాడతడు.

"ఇంకా మీకు ఆ అమ్మాయిపట్ల ప్రేమ మాత్రం మాసిపోలేదన్నమాట"

"పలకమీద రాసుకునే పాఠంలాగా ముగిసిపోగానే చెరిపేసుకునేంత సులభమైంది కాదండి మమతలు మర్చిపోవడం" బాధగా అన్నాడు ప్రభాకర్.

"ముగిసిపోయిందని ఎందుకనుకోవాలి ? మీరు యిప్పుడు మళ్ళీ కథ మొదలెట్టండి."

"అంటే..." సుబ్బారావు వంక సాలోచనగా చూశాడతడు.

"ఇప్పుడు మాత్రం, మీరా అమ్మాయిని తీసుకొచ్చుకుంటే..."

"నేనంత దుర్మార్గుణ్నే కాదండీ" నొచ్చుకుంటూ అన్నాడు.

"సారీ, సారీ, ఆ అమ్మాయి భర్త ఈ విషయంలో అభ్యంతరం తెలపకుంటే..."

"అదే జరిగితే నాకన్నా అదృష్టవంతుడీ లోకంలో ఎవడూ వుండడుసార్. కానీ జరగాలిగా."

"జరిగిందనే అనుకోండి ఐనా యింకా ఆ అమ్మాయి తుమ్మెదవాలని పువ్వులాగే వుంటుందనుకుంటున్నారా ?"

"సార్, నిజంగా మీరన్నట్టే జరిగితే, నేనీ విషయం ఆలోచించను. శారీరక పవిత్రత కాదండీ నేను కోరుకునేది. నా కుసుమ యెప్పుడూ మనసులో మాత్రం నన్నే నిలుపుకుంటుంది. నాక్కావలసింది ఆ కుసుమే"

''అదృష్టవంతురాలు'' అనుకున్నాడు సుబ్బారావు, కుసుమని గురించి లోలోపలే.

కాస్సేపాగి అన్నాడు—

''చూడండి. మీతో యీ నిజం దాచి, మాట్లాడినందుకు నిజంగా నేను బాధపడుతున్నాను. కానీ మీ మనసు తెలుసుకోడానికే నేనిలా చేశాను. నేనే కుసుమను పెళ్లి చేసుకున్న వ్యక్తిని.''

ఉలిక్కిపడ్డాడు ప్రభాకర్. అతడు సుబ్బారావును తప్పుగా అర్థం చేసుకున్నాడు. అతని ముఖంలో సుబ్బారావు పట్ల అసహ్యం కనిపించింది సుబ్బారావు అది గమనించాడు.

''కానీ, చూడండి మీరు కుసుమకు రాసిన ఉత్తరం నేను చూశాను. అది సంస్కారవంతమైన పని కాకపోవచ్చు. ఐతే అది నేను చూడటం వల్లనే మీ విషయం తెలుసుకున్నాను మీరు కుసుమను పెళ్లి చేసుకుంటె నాకెలాంటి అభ్యంతరమూ లేదు ''

''సార్'' ఆశ్చర్యపోతూ అన్నాడు ప్రభాకర్ సుబ్బారావు ఇంకా మాట్లాడుతూనే వున్నాడు.

''అంతేకాదు, కుసుమ మానసికంగానే కాదు, శారీరకంగా కూడా మీకే అంకితం కావాలని చూస్తోంది.''

''మీరు చెబుతున్నది...'' అతిశయించిన ఆనందంతో, అది నిజం కాదేమోనన్నట్టు చూశాడు ప్రభాకర్.

''నిజమే. మీరు నమ్మలేకపోవచ్చు. కానీ నమ్మాలి.''

''నిజంగా మీరు దేవుడు'' సుబ్బారావు చేతులు పట్టుకుని అన్నాడు.

సున్నితంగా అతని చేతుల్లోంచి విడిపించుకున్నాడు సుబ్బారావు. అతడి మనసు చాలా తేలికగా వుంది.

''చూడండి. మీరు నాతోపాటు విజయవాడ వస్తే, మీ యిష్టమైతే మీ మావయ్య వాళ్లింట్లో చెప్పి, కుసుమను తీసుకొచ్చుకోండి. బహుశా మీరు చెప్పిన విషయాలను బట్టి, ఇందుకు మీవాళ్ళ అభ్యంతర పెటరనుకుంటాను'' అన్నాడు.

''లేదు అలాగే. ఇంటికివెడదాంపదండి'' లేస్తూ అన్నాడు ప్రభాకర్. అతడికి సుబ్బారావు దేవుడుకంటె మిన్నగా కనిపిస్తున్నాడు.

''అలాగే. కానీ మీ యింట్లో ఇప్పుడేమీ చెప్పకండి'' లేస్తూ అన్నాడు సుబ్బారావు.

''సరే.''

వంతెన చేరుకున్నారు.

''ఈ వంతెన చాలా చిన్నదనుకుంటాను.



పైగా ఎంతోకాలం పనిచేయదేమో'' దాని మీదుగా నడుస్తూ అన్నాడు సుబ్బారావు.

''కాని అది చేస్తున్న సహాయం మాత్రం గొప్పది'' అన్నాడు ప్రభాకర్.

దూరంగా గూటిలోని గువ్వల జంట ఎగిరిపోతూంది. తుమ్మెద తాకినందుకే అన్నట్టు, అది వాలిన మందార పువ్వు పులకరించిపోతూంది. కొలనులో విరిసీ విరియని కమల కుసుమాలు ప్రభాకరుడి కోసమే ఎదురు చూస్తున్నాయి. అందాకా మబ్బు పట్టిన ఆకాశంలోంచి సూర్యుడు కనిపిస్తున్నాడు. అవన్నీ చూస్తూ యిద్దరూ మౌనంగా సాగిపోయారు.

సాయంత్రం అయిదు కావస్తూంది. కుసుమ వంటింట్లో కూరగాయలు తరుగుతూంది. మెట్లపైన అడుగుల చప్పుడు వినిపించటంతో తలెత్తి చూసిన ఆ అమ్మాయికి సుబ్బారావు వెనుకగా మరో మనిషి కనిపించాడు. లేచి పైట నిండుగా కప్పుకుని వంటింటి గుమ్మం దగ్గర నిలుచుంది.

''రండి. లోపలికి'' అక్కడే ఆగిన అతడితో అంటూ లోపలికి నడిచాడు సుబ్బారావు.

కుసుమ గుండె ఝల్లుమంది. ప్రభాకర్ ఆమె వంక చూళ్లేదు.

''కుసుమా, ఎవరొచ్చారో చూడు'' అన్న సుబ్బారావు మాట ఆమె కర్థం కాలేదు. అంటే ప్రభాకర్ తన బావ అని యితడికి తెలుసునా? ఐతే తనకు ప్రభాకర్‌కు పెళ్ళి జరుగుతుందన్న విషయం తెలియదా? ఏమీ అర్థం కాలేదు.

తల వంచుకుని వెళ్లింది హాల్లోకి.

''చూడు కుసుమా, ప్రబాకర్ నీకు రాసిన ఉత్తరం నిన్ననే వచ్చింది. కానీ నేనే నీ కివ్వలేదు. క్షమించు'' అంటూ వుత్తరం అందించాడు.

గుండెలు వేగంగా కొట్టుకుంటూండగా ఆ ఉత్తరం తీసుకుంది.

''మీ రిద్దరూ మాట్లాడుతూకూర్చోండి నేను కాఫీ తీసుకొస్తాను'' అంటూ ఫ్లాస్కు తీసుకుని బయటకు నడిచాడు.

సుబ్బారావు బయటికి వెళ్లగానే కుసుమలోని దుఃఖం కట్టలు తెంచుకుంది. కుర్చీ కానుకుని నిల్చుని బావురుమంది. ఒక్క క్షణం ప్రభాకర్ కేంచేయాలో పాలుపోలేదు, లేచి,

# బాగా మురికి బట్టిన బట్టను ఎల్లాగ శుభ్రంచేయడము



బట్టలు మాసిపోవడం చాలా వింతగా కన్పిస్తుంది. కార్యా ... ముందు కుర్చీలో కూర్చుంటాడు, కార్యాధ్యక్షుడు అవుతాడు; ఒక ఫ్యాక్టరీలో పర్యవేక్షణ చేస్తూంటాడు — అతడి బట్టలకు మట్టి, దుమ్ము అయస్కాంతంలా ఆకర్షింపబడుతుంది! సరే, వాటిని ఎల్లాగ శుభ్రంచేయడము — వాస్తవంగా అక్షరాలా శుభ్రంచేయడము అనేదే — మీ సమస్య, మీదేకాదు. అది మా సమస్య, కూడాను అందచేతే క్రొత్త! రమ్యను తీసుకువచ్చాము మీకు: పరిశుభ్రంచేసే డెటర్జెంటు.

**క్రొత్త! రమ్య శాస్త్రయుక్తంగా చాల లోపల లోతులకు జేరి అక్కడ అంటుకుపోయిన మట్టి మరకా లేకుండా పరిశుభ్రం జేసేటట్టు తయారుకాబడింది.**

రెండు సంవత్సరాలపాటు పరిశోధన తరువాత పరీక్ష చేసి పునః పరీక్ష చేసి తరువాత మీ చేతిలో పెట్టగలిగిన వరప్రసాదము. క్రొత్త! రమ్యలో ప్రత్యేకమైన సర్ఫెక్టాంట్ నిర్దాక్షిణ్యంగా దుమ్మును మట్టినిపోగొట్టి మీ బట్టలను మృదువుగాను శుభ్రంగాను చేస్తుంది అచ్చెరువుగొలిపే శుభ్రత!




# క్రొత్త! రమ్య

## పరిశుభ్రంజేసే డెటర్జెంట్




సబ్బు బిళ్ళలుగాను చిన్న చిన్న సంచుల లోనూ కూడా లభిస్తుంది

**మాసిన బట్టలను శుభ్రంగాను శుభ్రమైన బట్టలను మరింత శుభ్రంగాను చేయును**

అల్ట్రామెరైన్ & పిగ్మెంట్స్ లిమిటెడ్, రాణీపేట, తమిళనాడు

కుసుమ దగ్గరకు వెళ్ళి, అతి కష్టంమీద ఆమెను ఓదార్చాడు. జరిగిన విషయమంతా చెప్పడంతో తెల్లపోయింది కుసుమ.

"అవును కుసుమా. నేను మొదట నమ్మలేదు. కానీ నిజం!?" నమ్మకం కలిగేట్టుగా అన్నాడు ప్రభాకర్.

"బావా, మనుషుల్లో దేవుళ్ళుంటారని విన్నాను. ఇలాంటి మనుషుల్ని కథల్లో చదివాను కాని నిజంగా చూస్తున్నానంటే ఇది కలేమో ననిపిస్తూంది."

"నిజం కుసుమా. అవునూ, అసలు నువ్వు ఈ అడ్రస్ కెందుకు రాయమన్నావు వుత్తరం?"

"ఇప్పుడు మన మంచికోసమేమో ననిపిస్తూంది. రెండు రోజులు ఆయన ప్రవర్తన చూసి నావుత్తరాలుచదవరేమోననుకున్నాను"

"ఆ విషయంలో ఆయన్ని తప్పు పట్టకు కుసుమా. బస్సులో వుత్తరం ఎందుకు చదివిందీ నాకు చెప్పారు" అంటూ చెప్పాడు ప్రభాకర్.

అప్పుడే సుబ్బారావు వచ్చాడు. అతన్ని చూస్తూనే యిద్దరూ మాటలు ఆపేశారు.

"అరె. అప్పట్నుంచీ యిలాగే వున్నారేమిటి మీరు. కూచోండి. నేను కప్పులు తీసుకొస్తాను" అంటూ లోపలికి వెళ్ళబోయాడు.

చెయ్యి అడ్డుపెడుతూ వారించింది కుసుమ.

"దయచేసి నన్ను యిబ్బంది పెట్టకండి" అంటూ లోపలికి వెళ్ళింది.

## రాదారి పడవ

సుబ్బారావు కూచుంటూ, "కూచోండి" అన్నాడు ప్రభాకర్‌ను.

కాఫీ తాగినాక అన్నాడు సుబ్బారావు—

"మిమ్మల్నింకా యిబ్బంది పెట్టదల్చుకోలేదు నేను. కుసుమా, నీబట్టలూ, అవీ సర్దుకో"

మౌనంగా వెళ్ళింది కుసుమ.

పెళ్ళినాటి ఫోటోలు చించేశాడు, ఫ్రేమ్‌లో బిగించిన దానితోసహా. 'మారేజ్ గ్రీటింగ్స్' అని రాసిన ఒక కాగితం మళ్ళీ అందులో అమర్చి ప్రభాకర్ కిచ్చాడు.

"బహుశా మీ పెళ్ళికి నేను రాకపోవచ్చు. ఇంతకన్నా మీకు ఏ బహుమానమూ యివ్వలేను." మనఃస్ఫూర్తిగా అన్నాడు.

ప్రభాకర్ కళ్ళు చెమ్మగిల్లాయి

"సార్, మీదృష్టిలో దీనికి విలువ లేకపోవచ్చు. కానీ యీ ప్రపంచంలో మాకు యింతకన్నా విలువైంది మరొకటుండదు" అన్నాడది తీసుకుని ప్రభాకర్.

కుసుమ తన సూట్ కేస్ తీసుకుని వచ్చింది.

సుబ్బారావిచ్చిన ఫ్రేమ్ తీసిచ్చాడు కుసుమకి, ప్రభాకర్. అది తీసుకుని, భద్రంగా పెట్టె అడుగున దాచింది కుసుమ. లేచి నిలబడి ప్రభాకర్ కళ్ళల్లోకి చూసి మూగగా ఏదో చెప్పింది. వాళ్ళవంకే చూస్తున్నాడు సుబ్బారావు.

ఇద్దరూ ఒక్కసారి అతని కాళ్ళకు దణ్ణం పెట్టారు.

"అరరె..." అంటూ లేచి నిలుచున్నాడు సుబ్బారావు.

"ఏమిటిది ? మిమ్మల్ని దీవించటానికి నేను మీకంటే ఎంత పెద్దవాణ్ణి కనుక" నొచ్చుకుంటూ అన్నాడు.

"వయసుతో నిమిత్తం లేదు మాకు. మీ మంచి మనసుతో దీవిస్తే జీవితాంతం సుఖంగా వుండాలని మా ఆశ" అన్నాడు ప్రభాకర్.

"నా కోరిక కూడా అదే" సుబ్బారావు అన్నాడు.

"నాదొక చిన్నకోరిక తీరుస్తారా ?" సుబ్బారావు వంక చూస్తూ అంది కుసుమ.

"ఏమిటో ? నా చేతనైతే తప్పకుండా"

"మీ ఫోటో యివ్వండి"

"ఎందుకు ?"

"మా దేవుడు మీరు. మీ పేరు చెప్పుకుని మా యింట్లో దీపం వెలిగించుకుంటా." కుసుమ గొంతు కొద్దిగా వణికింది.

"దేవుడితో పోల్చి నన్ను లేనివాణ్ణి చేయకండి. నేను మామూలు మనిషిని. నా ఫోటో కావాలంటే తీసుకో" అంటూ గోడకు తగిలించిన ఫ్రేమ్ తీసిచ్చాడు.

దాన్నికూడా పెట్టేసి, సూట్‌కేస్ మూసేసింది కుసుమ.

ప్రభాకర్ సూట్‌కేస్‌ను చేతిలోకి తీసుకున్నాడు. కుసుమ అతన్ని అనుసరించింది.

"వెళ్లొస్తామండీ" అన్నారిద్దరూ, గుమ్మం దాటుతూ.

"మంచిది" అన్నాడు సుబ్బారావు.

కొంచెం సేపట్లో యిద్దరూ కనుమరుగయ్యారు.

* * *

ప్రసూన వెళ్ళినప్పటిలా భారంగా లేదు అతని హృదయం, అమాయకులైన, వాళ్ళిద్దరిని కలిపానన్న తృప్తితో నిండి వుంది.

రేపటి సంగతి తరువాత, యివాళ్టికి యింట్లోనే తినేయొచ్చు. తరుగుతున్న కూరగాయ ముక్కలు జాడీలో వేసి మూత వేసినా, అన్నం మాత్రం వండింది కుసుమ, ఫర్వాలేదు—అనుకున్నాడు.

* * *

సుబ్బారావు చేసిన పనికి కుసుమ తండ్రి కాంట్రాక్టర్ చాలా మండిపడ్డాడు. కానీ

(32వ పేజీ చూడండి)





"నిజం నిద్రపోదు"లో మమత

### జనవరి 15 న అన్నపూర్ణా స్టుడియోస్

"నటసామ్రాట్" నాగేశ్వరరావు యీ ఏడు మధ్యన తలపెట్టిన అన్నపూర్ణా స్టుడియోస్ రాబోయే జనవరికి జగపతి పిక్చర్స్ వారి "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రంతో ప్రారంభమయ్యేది తథ్యము అనేది నిజాన్ని, జూబ్లీహిల్స్‌లో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమం స్థిరపరిచింది

"బంగారు బొమ్మలు"తో స్టుడియో ప్రారంభమవుతుందని, సురేష్ వారి "సెక్రటరి" స్టుడియో నుంచి వెలువడే మొదటి చిత్రం కాగల దని, నాగేశ్వరరావుగారు చెప్పారు

సంవత్సరానికి అయిదు చిత్రాలు పని చెయ్యొచ్చు అని అమెరికన్ డాక్టర్లు యిచ్చిన సలహాకు అనుగుణంగా తాను ప్రవర్తించగలనని, అక్కినేని అన్నారు

నూతనోత్సాహంతో వెండితెరను ప్రవేశించిన అక్కినేనికి "క్షేత్రయ్య" ఘనవిజయాన్ని తెచ్చి పెట్టగలదు

### ఆత్రేయ రాజ్యం !

సంభాషణలు వెయిట్‌గా వుంటూ, స్వీట్ గానూ వుంటూ వినేవాళ్లకు వుత్సాహాన్ని, వుద్వేగాన్ని కలిగించే శక్తి ఆచార్య ఆత్రేయ కలానికి వున్నదనేది నిజాన్ని ఎవరూ కాదనలేరు

అక్కినేనిగారన్నట్లు ఆత్రేయ సంభాషణలు



## ⁂ సినిమా విశేషాలు ⁂

నిజజీవితానికి వుపయోగపడేవిగా కూడా వుంటాయి

ఆత్రేయ రాయాలేగాని, ఎందరయినా ఆయన కలాన్ని వాడుకోగలరు ఆయన రాసే మాటలను క్రమబద్ధంగా, అర్థయుక్తంగా పలికేవాళ్లే తక్కువగా కనిపిస్తున్నారు

ప్రస్తుతం ఆత్రేయ అయిదు చిత్రాలకు తన విద్యను పంచిపెట్టారు

"నటసామ్రాట్" నాగేశ్వరరావు నటిస్తున్న "బంగారు బొమ్మలు, సెక్రటరి, మహాత్ముడు" చిత్రాలకు, 'నటరత్న' రామారావు నటించనున్న "సతీసావిత్రి"కి, శోభన్‌బాబు నటించబోయే "మిష్టర్ సంపత్ ఎం ఏ" చిత్రానికి ఆత్రేయ మాటలను సమకూరుస్తున్నారు

ఇక పాటలంటారా! ప్రతి చిత్ర నిర్మాత ఆత్రేయగారి పాటల కోసం పోటీ పడి తెచ్చుకొంటున్నారు

తెలుగు చిత్ర రచనా రంగంలో ఆత్రేయది అగ్ర స్థానం అనడానికి జంక పనిలేదు

### అక్కినేని చిత్రానికి తాతినేని సంగీతం

రాజేశ్వరీ చిత్ర నిర్మిస్తున్న "మహాత్ముడు" వర్ణ చిత్రానికి తాతినేని సంగీత దర్శకత్వాన్ని స్వీకరించారు

తాతినేని సంగీతం సమకూర్చిన ఎన్నో చిత్రాల్లో అక్కినేని కథానాయకుడుగా నటించిన నిజం ప్రేక్షకులకు తెలుసు "మహాత్ముడు" కథను నిర్మాత గోపీనాథ్ రాశారు మాటలను ఆచార్య ఆత్రేయ రాస్తున్నారు

అన్నపూర్ణా స్టుడియోస్‌లో తెలుగు సంవత్సరాది నుండి "మహాత్ముడు" షూటింగు ప్రారంభం కాగలదని తెలుస్తోంది చలపతిరావు సంగీతం "మహాత్ముడు" చిత్రానికి యస్సెట్‌గా వుండాలి

### విచిత్ర వేషధారి !

మన సత్యనారాయణగారిని విచిత్ర వేషధారిగా పేర్కొనవచ్చు సత్యనారాయణ ధరిస్తున్న పాత్రలో వున్న వైవిధ్యం మరెవ్వరి పాత్రల్లో కనిపించదు

ఒకరోజు సాంఘిక చిత్రంలో కరుణారసం నిండిన పాత్రలో కనిపిస్తే, మరొకరోజు రౌద్రరస భరితమయిన మరాఠీ పాత్రలో కనిపించి, రెండు పాత్రల్లో తనకు గల ప్రత్యేకతను ప్రదర్శించి, సెహభాష్ అనిపించుకోగలుగుతున్నాడు

సుయోధనుడు, రావణబ్రహ్మ, మంచి అన్నయ్య, ఉత్తమ పౌరుడు, దుష్టనాయకుడు, త్యాగశీలివంటి విభిన్న మనస్తత్వాలు వున్న పాత్రలను పోషిస్తున్న సత్యనారాయణగారిని విచిత్ర వేషధారి అనడంలో తప్పులేదు

ప్రేక్షకుల్లో సత్యనారాయణకు ప్రత్యేకమైన స్థానం వున్న నిజాన్ని ఎవరూ కాదనలేరు

### నవ్వించే పాత్రలు

లావణ్య పిక్చర్స్ నిర్మిస్తున్న "ముగ్గురు మూర్ఖులు" చిత్రం ప్రేక్షకులకు ఆనందాన్ని, వుత్సాహాన్ని, వినోదాన్ని, విచిత్రానుభూతిని కలిగించే గమ్మత్తయిన పాత్రల చుట్టూ నడుస్తుంది

"మూర్ఖులు"గా నటిస్తున్న నాగభూషణం, సత్యనారాయణ, రాజబాబుగార్లు ఎవరు గొప్ప అనే విధంగా పోటీపడి నటిస్తున్నారు

సహాయ పాత్రలను గుమ్మడి, దేవిక, చంద్రమోహన్, రోజారమణి, ప్రభాకరరెడ్డి, రాజసులోచన పోషిస్తున్నారు

హాస్య సన్నివేశాల చిత్రీకరణలో ప్రత్యేకతను బడసిన హేమాంబరధరరావు "ముగ్గురు మూర్ఖులు" చిత్రాన్ని వినోద కాలక్షేప చిత్రంగా రూపొందిస్తున్నారు

ఈ చిత్రానికి జి కె రాము, చక్రవర్తి ఛాయను, సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

నిర్మాత మహేష్‌కు డబ్బు నార్జించిపెట్టగల అర్హత యీ నవ్వుల చిత్రానికి వుంది



"వజ్రాల దొంగ"లో లత



"పిచ్చిమారాజా"లో శోభన్‌బాబు, మంజుల

# సినిమా

## విక్టరీ చిత్రాలు !

వీరమాచనేని మధుసూదనరావుగారిని "విక్టరీ"గా మొట్టమొదట నేను రాసినప్పుడు, అవహేళన చేసినవాళ్లే, యీనాడు ఆయన్ను అదే పేరు పెట్టి పిలుస్తున్నారు ఎక్కువ విజయాలను చవిచూచిన వ్యక్తి, గనకనే, ఆయన్ను "విక్టరీ" అనగలిగాను

ప్రస్తుతం "విక్టరీ" అయిదు చిత్రాలను అంగీకరించారు "తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారి చిత్రం, చటర్జీగారి చిత్రం, హరికృష్ణగారి చిత్రం, హనుమంతరావుగారి చిత్రం, ముఖర్జీగారి చిత్రం"

పరిశ్రమకొచ్చి రెండు దశాబ్దాలు దాటినా, యిప్పటికీ పలుకుబడి వున్నదంటె, ఎంతటి ప్రతిభావంతుడై అయ్యుండాలి కృషీవలుడు చిత్ర చిత్ర ప్రవర్ధమాన మవుతాడు అని "విక్టరీ" నిరూపించారు



"మంచిమారాజా"లో జయసుధ

## మిస్టర్ సంపత్ ఎం ఎ.

ప్రముఖ నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన విరచితమైన "మిస్టర్ సంపత్ ఎం ఏ" నవలను నిర్మాత ఎ హనుమంతరావు కొన్నారు

మద్రాస్ సోషల్ అండ్ కల్చరల్ క్లబ్బు యొక్క గౌరవ కార్యదర్శిగా వుంటూ, అనేక సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నదీ హనుమంతరావుగారే

ఈయన తలపెట్టినది వర్ణ చిత్రము దీనికి దర్శకత్వం నిర్వహిస్తున్నది విక్టరీ మధుసూదనరావు

కథానాయకుడుగా నటించడానికి శోభన్‌బాబు అంగీకరించి, ఏప్రిల్ నుంచి కాల్‌షీట్లు కేటాయించడం జరిగింది

## రవీంద్రాకు విక్టరీ

విఖ్యాత చిత్ర నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి వచ్చే సంవత్సరం తనతో ఒక వర్ణ చిత్రాన్ని తీయడానికి నిర్ణయించినట్టు శోభన్ చెప్పి, ఆ చిత్రాన్ని విక్టరీ డైరెక్ట్ చెయ్యగలరన్న వార్తను వెల్లడించారు

## అనాటి అనుబంధము !

'వీరాభిమన్యు"గా శోభన్‌బాబును తీర్చిదిద్ది, "మనుషులు మారాలి"కి ఆయనే కావాలి అని నెగ్గి, "కళ్యాణ మంటపం"లో నాయకుడుగా పెట్టి, "జేబుదొంగ"తో ఘనవిజయాన్ని సాధించిన విక్టరీ మధుసూదనరావుగారి పట్ల, శోభన్‌కు వున్న కృతజ్ఞతా భావం వర్ణనాతీతం

ఆనాటి అనుబంధము యీనాటికీ యిద్దరిలో వుండడం సత్ఫలితాలకు దారితీయగలదు

## కాంతారావుకు ప్రశంసావాక్యం

ఇప్పుడొస్తున్న చిత్రాలలో కాంతారావు వైవిధ్యం వున్న వేషాలను కడు సమర్ధవంతంగా పోషిస్తున్నట్టు, అగ్రనటుడు ప్రశంసించారు కాంతారావు "ముత్యాల ముగ్గు, గుణవంతుడు" చిత్రాలలో హుందాగా నటించిన నిజాన్ని ప్రేక్షకులు కాదనలేరు



"దొరలు—దొంగలు"లో వాణిశ్రీ, చంద్రమోహన్

### జయ పదం!

తెలుగు చిత్రాల్లో హీరోయిన్‌గ నటిస్తున్న వారి పేర్లలో "జయ" పదము వినిపిస్తున్నది.

జయచిత్ర ఆరు తెలుగు చిత్రాలలో, జయప్రద ఏడు తెలుగు చిత్రాలలో, జయసుధ ఏడు చిత్రాలలో నాయికలుగా నటిస్తున్నారు.

"స్వర్గం — నరకం" చిత్రంలో నటించిన జయలక్ష్మికి మరో మూడు చిత్రాలు వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

జయచిత్ర మాతృభాష తెలుగు. ఆనాటి అమ్మాజీ యీమె తల్లి. జయప్రద రాజమండ్రి నివాసి. జయసుధకు మద్రాస్ తెలుగు వచ్చు. 'సాహిత్య కోవిద' నిడదవోలు వెంకటరావుగారి మనవరాలు. జయలక్ష్మిది తెలుగుదేశము. ఈమె తండ్రి దశరధరామరెడ్డి జెమినీ సంస్థలో నిర్మాణ నిర్వాహకుడిగా పనిచేశారు.

### ఇద్దరికి ఆదరణ

జయచిత్ర ఎట్టి పాత్రకయినా న్యాయం చెయ్యగలదు. తమిళంలో అన్నిరకాల పాత్రలను పోషించి, సెహభాష్ అనిపించుకుంది.

జయప్రద పెద్ద దర్శకుల చిత్రాలలో పని చెయ్యడంవల్ల, బంగారు భవిష్యత్తును ఏర్పరచుకోగలదు.

జయసుధ గ్లామర్ పాత్రలకు పూర్తి న్యాయం చెయ్యగలదు. తెలుగు ఉచ్చారణలో శ్రద్ధ అవసరం.

జయలక్ష్మి సాత్విక ప్రధానమైన పాత్రలను మాత్రమే పోషించగలదు.

పైన పేర్కొన్న నలుగురిలో యిద్దరికి మాత్రమే తెలుగు ప్రేక్షకుల ఆదరణ, అభిమానం లభింపగలదు. మిగతా యిద్దరికి వారు ప్రదర్శించే నటనా నైపుణ్యాన్ని బట్టి, ఆదరణ లభించగలదు.

### జయసుధ చిత్రాలు

"హీ—మాన్" సరసన జయసుధకు మూడు చిత్రాలలో నాయిక వేషాలు లభించాయి.

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్, శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్, సురేష్ ప్రొడక్షన్స్ ఈ మూడుగాక విఠలాచార్య చిత్రంలో, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో, అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ చిత్రంలో జయసుధకు నాయిక పాత్రలు యివ్వబడ్డాయి

### జయప్రద చిత్రాలు

బాలచందర్‌గారి చిత్రం, విశ్వనాథ్‌గారి రెండు చిత్రాలు, బాపుగారి సీతాకళ్యాణం, విక్టరీగారి "మిస్టర్ సంపత్ ఎం. ఏ" విజయావారి "రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్" ఆర్. కె. ఆర్ట్స్ వారి "నల్ల రేగడి" చిత్రాలలో జయప్రద నాయికగా నటిస్తున్నది

### జయచిత్ర జయలక్ష్మి

ఆరు తెలుగు చిత్రాలలో జయచిత్ర నటిస్తున్నట్టు వ్రాశాను. "స్వర్గం — నరకం" చిత్రంలో నటించిన జయలక్ష్మి అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ వారి "జ్యోతి" చిత్రంలో నటిస్తున్నది.


"మనస్సాక్షి"లో ఉమ

### రామదాసుగా బాలయ్య

భక్తరామదాసుగా బాలయ్య, తానీషాగా ప్రభాకరరెడ్డి నటిస్తున్న వర్ణ చిత్రాన్ని శ్రీ లక్ష్మి కళామందిర్ తలపెట్టింది. ఈ చరిత్రాత్మక పౌరాణిక చిత్రానికి కధ, సినిమా అనువాదం సమకూర్చి, దర్శకత్వాన్ని కూడా తోట రామమోహనరావు చేపట్టారు.

### నాయికగా శారద

ఆంధ్రుల అభిమాన నటి శారద నాయికగా నటిస్తున్నట్టు, దర్శకుడు రామమోహనరావు చెప్పారు. ఈ చిత్రంలో హనుమయ్య, మీనాక్షి అనెడి కొత్త కళాకారులు ముఖ్య సహాయ పాత్రలను పోషిస్తున్నారు

ఈ చిత్రానికి మాట — పాటలను మోహన్ కృష్ణ రాశారు సంగీతానికి మాష్టర్ వేణు, ఛాయకు షణ్ముగం, కళకు బాలు, కూర్పుకు భరణీ సుందరం అధిపతులు

ఉగాది పర్వదినాన యీ భద్రాద్రి భక్తుని విడుదల చెయ్యాలనెడి ఉద్దేశ్యం నిర్మాతలకు ఉంది

### యువ చిత్ర!

హిట్ దర్శకుడు విశ్వనాథ్ హిట్ నాయకుడు శోభన్, హిట్ సంగీత దర్శకుడు మామ కలిసి పని చేస్తున్న వర్ణ చిత్రాన్ని "యువ చిత్ర" తలపెట్టింది.

రాబోయే జూన్ నుంచి ప్రారంభం కానున్న ఈ చిత్రానికి కథ, చిత్రానువాదంకూడా అగ్ర దర్శకుడే సమకూర్చడానికి సమ్మతించారు ఈ సంస్థకు కాట్రగడ్డ మురారి అధినేత ఇతగాడికి దర్శకత్వ శాఖలో ప్రయోజనకరమైన అనుభవం వుంది.

"విశ్వనాధ్ — శోభన్" జంటకు ప్రేక్షకుల్లో ప్రత్యేకమైన గౌరవం వున్నది వాస్తవం గాబట్టే, "చెల్లెలి కాపురం, కాలం మారింది, జీవనజ్యోతి" చిత్రాలు ఘనవిజయాన్ని సాధించగలిగాయి.

సమర్ధులయిన ముగ్గురిని తనవాళ్ళుగా చేసుకున్న యువ చిత్ర నిర్మాత మురారి ఎంతేని అదృష్టవంతుడు.

— శ్రీనివాస్

ధారావాహిక

## శ్రావణ సంధ్య

తాళ్ళూరు నాగేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

**25**

ఆ రోజు పగలు ఎండ వొళ్ళు విరుచుకొంటూన్న కన్యలాగ మిడిసి పడుతోంది.

పన్నెండు గంటల ప్రాంతంలో మెల్లగా తలుపు తెరుచుకొంటూ రాజారాం ఇంట్లోకి వచ్చాడు. రాంమ్మోహన్ పేపరు చూస్తున్నాడు. రాజారాంను సాదరంగా ఆహ్వానించాడు. ఆ కుటుంబంలో తుఫాను చెలరేగటానికి అవసరమైన వాతావరణాన్ని అప్పటికే కల్పించి వస్తున్నాడు రాజారాం. పదిన్నర గంటలకు జ్యోతి సలహా ప్రకారం రఘునాధ్ ఇంటికి వెళ్ళాడు. ఆయన భార్య లీలామణితో మాట్లాడాడు. ఆడవల్సిన అబద్ధాలన్నీ ఆడాడు; కార్చవల్సిన మొసలి కన్నీళ్లన్నీ కార్చాడు; నటించాల్సిన నాటకమంతా నటించాడు. మునగ కొమ్మను విరిచినట్టు ఆవిడ మనస్సును విరిచాడు. రఘునాధ్‌కూ, శాంతికీ ఉన్న అక్రమ సంబంధాలను కొండంతలు చేసి చెప్పాడు. సిటీ హోటళ్లలోనూ, గెస్టుహౌసుల్లోనూ వాళ్ళు నవదంపతుల్లా స్వైర విహారం చేస్తున్నారనీ, వెంటనే ఆవిడ గనక చర్యలు తీసుకోకపోతే, ఆ అవినీతి కార్యాల్ని అరికట్టకపోతే పరువు ప్రతిష్ఠలు బజారు పాలవుతాయనీ ఆవిడతో గట్టిగా చెప్పాడు. ఆవిడ ఆ మాటలన్నీ నమ్మి, భద్రకాళి రూపం ధరించి — "అట్టాగా! ఈ రోజే ఇద్దరి కాళ్ళూ విరిచి గనగన మండే గాడిపొయ్యిలో పెడతాను" అంది సంతృప్తిపడి నేరుగా రాంమ్మోహన్ ఇంటికి వచ్చాడు.

"ఎప్పుడొచ్చారు హైద్రాబాద్?"

"చెప్పానుగా - నెలకు రెండు మూడు సార్లు వస్తూ పోతూంటానని. అసెంబ్లీ జరుగుతూందిగా. ఏవేవో చిల్లరమల్లర పనులు బోలెడన్ని ఉన్నాయండీ!" అంటూ జేబులోంచి త్రీ ఫైవ్స్ పాకెట్ తీసి, రాంమ్మోహన్‌కు ఓ సిగిరెట్ ఆఫర్ చేశాడు. తాను ఒకటి తీసుకొని ఆ పాకెట్‌ను మంచంమీద ఉంచాడు సిగిరట్ లైటర్‌తో అతని సిగిరెట్ వెలిగించి తన సిగిరెట్‌ను వెలిగించుకొన్నాడు

"లైటర్ బావుందే!"

"ఆ మధ్య ఓ ఫ్రెండ్ అమెరికా నుంచి వస్తూ తెచ్చాడు హాంగ్‌కాంగ్‌లో కొన్నాడట మీరు ఉంచుకోండి నేను ఇంకోటి తెప్పించుకుంటాను." అంటూ రాజారాం ఆ లైటర్‌ను సిగిరెట్టు పాకెట్ మీద పెట్టాడు.

"వొద్దండీ! నాకు దేనికి? సర్దాగా అడిగాను. పైపెచ్చు ఇవి చెడిపోయినాయంటే అవతల పారవేయాలి వీటిలోకి గ్యాస్ ఇక్కడ దొరకదు."

"సికింద్రాబాద్‌లో ఓ షాపు ఉంది అక్కడ దొరుకుతుంది."

"వొద్దండీ! మీరే వుంచుకోండి ఇక్కడ ఇంట్లో పడివుండేవాడ్ని నాకీ ఫ్యాషన్లు దేనికి?" అన్నాడు రాంమ్మోహన్.

**జరిగిన కథ 9 :** ప్రేమించి పెళ్లి చేసుకున్న శాంతి, రాంమ్మోహన్‌ల అనురాగ ఫలం నీలిమ. వారు ఎంతో వైభవంగా తమ ఏడవ వెడ్డింగ్ యానివర్సరీ జరుపుకుంటారు శాంతి బావ రాజారావ్ వచ్చి వెళుతుంటాడు. స్కూటర్ ప్రమాదంలో కాలు, చేయి పోగొట్టుకుంటాడు రాంమ్మోహన్. ఆర్థిక యిబ్బందుల్లోకూడా పూర్వంలాగా జరగాలనే రాంమ్మోహన్ మనస్తత్వం శాంతిని బాధిస్తుంది రాంమ్మోహన్‌కు తిరిగి త్రాగుడు అలవాటు చేస్తున్న రాజారావ్‌ని అవమానించి పంపుతుంది శాంతి. రాంమ్మోహన్ పని చేసిన కంపెనీలోనే ఉద్యోగం సంపాదిస్తుంది శాంతి. ఉద్యోగం కంటిన్యూ కావాలంటే తన శీలాన్ని అర్పించమన్న మానేజింగ్ డైరెక్టర్ రఘునాథ్ అంటే అసహ్యించుకుంటుంది శాంతి. దారిద్ర్యంలో బాధపడటమో లేక దాన్నుంచి తప్పించుకోటానికి నైతికంగా దిగజారిపోవటమో తేల్చుకోలేకపోతోంది శాంతి. రఘునాథ్‌కి పర్సనల్ అసిస్టెంట్‌గా తన స్థానంలో స్థిరపడ్డ శాంతిని ఆ ఆఫీసులోంచి పంపేయాలనుకుంటుంది జ్యోతి. గతంలో తనను కాదని రాంమ్మోహన్‌ను వివాహమాడిన శాంతిపై ప్రతీకారచర్యగా జ్యోతికి అండగా నిలుస్తానంటాడు రాజారాం.

"మీరెప్పుడూ ఇంట్లో పడివుండటంవల్లనే లోకంలో ఏం జరుగుతూందో మీకు తెల్సుకొనే అవకాశాలు వుండటంలేదండీ."

"ఏం జరుగుతుందేమిటి ?"

"లోకంలో అనేకం జరుగుతూ వుంటాయి. వాటిని గురించి పట్టించుకొనేవాళ్ళు పట్టించుకొంటూనే ఉంటారు. పట్టించుకోనివాళ్లకు ఏమీ పట్టదు. మనల్ని గురించి ఏవో ప్రచారాలు జరుగుతూంటే, చెవులు మూసుకొని, చేతులు ముడుచుకొని కూర్చోలేం గదా !"

"మనల్ని గురించా ?"

"అంటే మిమ్మల్ని గురించీ, నాగురించీ కాదనుకోండీ !"

"మరెవర్ని గురించీ ?"

చెప్పటానికి సందేహిస్తూన్నట్టు నటించాడు రాజారాం, ఎదుటి వ్యక్తిలో అంతులేని కుతూహలాన్ని కలిగించే ఉద్దేశంతో.

"చెప్పండీ ! సందేహిస్తారేం ?"

"చెప్పమంటారా ? మీ మనస్సు నొచ్చుకుంటుందేమోనని అనుమానిస్తున్నా."

"మీరు నిజం చెబుతూంటే, నొచ్చుకున్నా ఫర్వాలేదు. ఇంతవరకు జీవితంలో ఎంతో చేదును అనుభవించాను. ఇప్పుడు మీరు చెప్పే నిజం ఎంత చేదు అయినా స్వీకరించే సహనం నాలో వుంది."

"ఆఁ! ఏమీలేదు. మన శాంతిని గురించి లోకం రకరకాలుగా అనుకుంటోంది. అసలు ఆడది ఉద్యోగం చేస్తూన్నదంటేనే పొగలేని నిప్పులాగ పుకార్లు పుడుతూ వుంటాయి. అందులో ఆ స్త్రీ ప్రవర్తనలో కొంత మెతక కనబడిందంటే, ఇహ చెప్పనక్కర్లేదు — ఆ కుటుంబం పరువు ప్రతిష్టలు వీధిలో వాల్‌పోస్టర్లతో సమానమే !"

క్రోధావేశంతో, అనుమాన తీవ్రతలో రాంమ్మోహన్ వొళ్లంతా సెగలూ పొగలూ అయింది.

"అసలు విషయం చెప్పు" అన్నాడు రాంమ్మోహన్ గంభీరంగా. ఆ కంఠంలోని కోపాన్ని గ్రహించిన రాజారాం కథ రక్తి కడుతోందనుకున్నాడు.

"ప్రత్యేకంగా చెప్పేదేముంది ? చేతులు కాలిపోయాక, ఆకులకోసం పరుగెత్తి లాభంలేదు. మీరు ఆవేశపడి ఏ అఘాయిత్యానికి పూనుకోకండి. నేను చెవులారా విన్నదీ, కళ్లారా చూసిందీ చెబుతున్నాను. మేనేజింగ్ డైరక్టరు రఘునాథ్, శాంతీ విచ్చలవిడిగా తిరుగుతున్నారు. మీరు గుర్తుతెచ్చుకోండి—ఉద్యోగంలో చేరిన తర్వాత శాంతి ఎన్నిసార్లు ఆఫీసు నుంచి రాత్రి ఎనిమిదిన్నరకూ, తొమ్మిదిన్నరకూ యింటికొచ్చింది. ఆఫీసులో పనివుండి వున్నానని మీతో అబద్ధం చెప్పివుంటుంది అవునా? ఆ టైంలో వాళ్లిద్దరూ బేగంపేటలో వున్న గెస్టుహౌస్‌లోనో, బ్లూమూన్‌లోనో కులుకుతూ ఉండేవాళ్లు. ఓరోజు సాయంకాలం ఆరున్నరకు శాంతి బ్లూమూన్‌లోకి వెళ్లటాన్ని నేను కళ్లారా చూశాను. నా మాటలమీద మీకు నమ్మకం లేకపోతే ఆఫీసులో ఎవరినైనా ఎంక్వయిరీ చేయండి. వాళ్లిద్దర్నీ గురించీ ఆఫీసులోనూ, బయటా ఏమనుకుంటున్నారో మీకే ప్రత్యక్షం తెలుస్తుంది. అసలు నేను విన్నదేమిటంటే, రఘునాథ్ స్త్రీలోలుడనీ, అందమైన ఆడవాళ్లంటే పడిచస్తాడనీ, ఆ బలహీనత ఆయనలో ఎక్కువగా వుందనీ, శాంతికి ఆ బలహీనత వల్లనే పెద్ద ఉద్యోగం యిచ్చాడనీ, తన అవసరాల్ని ఆమె గడుపుతూంటే అడిగినప్పుడల్లా అడిగినంత డబ్బు యిస్తున్నాడనీ !"

రాంమ్మోహన్ కొయ్యబారి కూర్చుండిపోయాడు కళ్లల్లో ఎర్రని జీరలు తొంగిచూస్తున్నాయి, కోపోద్రేకంతో వొళ్లంతా గజగజ వొణికిపోతూంది రెప్పవాల్చకుండా శూన్యంలోకి చూస్తున్నాడు ఆ భీకర రూపాన్ని చూసేసరికి రాజారాంకు భయమేసింది పెద్ద తుఫాన్ వచ్చేముందు వాతావరణం ఎంత నిశ్శబ్దంగా వుంటుందో, అంత నిశ్శబ్దంగా వుంది అక్కడి వాతావరణం. డైనమెట్ వైర్‌కు అగ్గిపుల్ల వెలిగించాడు ఆ వైర్ కాలుకుంటూ వచ్చి, ఎప్పుడో 'ఢాం' అని పేలి, ఆ ఇంటి పునాదుల్ని లేపుతుంది. అప్పటిదాకా తాను అక్కడ వుండడం దేనికి ? 'వెళ్ళొస్తాను' అని చెప్పకుండానే రాజారాం త్రీ ఫైవ్స్ సిగిరెట్టు ప్యాకట్‌నూ, లైటర్నూ తీసుకొని పక్కజేబులో పెట్టుకొంటూ అక్కడనుంచి జారుకున్నాడు

*   *   *

ఉదయం పదకొండుగంటల నుంచీ, సాయంత్రం నాలుగుగంటల లోపు అరగంటకోసారి చొప్పున ఆఫీసుకు రఘునాథ్‌కు ఫోన్ చేసింది లీలామణి రాజారాం వచ్చి ఆ రహస్యాన్ని బట్టబయలు చేసిన దగ్గర్నుంచీ ఆవిడ వొళ్లు ఆవిడ స్వాధీనంలో లేదు క్రోధంతో, ద్వేషంతో, అవజ్ఞతో గాడిపొయ్యి మీద వున్న బాండీలోని నూనె వలె సలసల కాగిపోతుంది.

ఎన్నిసార్లు ఫోన్ చేసినా "బయటి కెళ్లారు" అనీ, "ఎక్కడో మీటింగ్‌లో వున్నారు" అనీ, "ఓ గంటలో వస్తారు" అనీ టెలిఫోన్ ఆపరేటర్ చెప్పసాగింది. చివరకు ఆవిడకు విసుగేసి, సాయంత్రం నాలుగున్నర గంటలకు కారేసుకొని నేరుగా ఆఫీసుకు వచ్చింది. అంతకు అయిదునిముషాల క్రితమే రఘునాథ్ ఒక కాన్ఫరెన్స్ నుంచి ఆఫీసుకు వచ్చాడు. వాళ్ల ఆవిడ అరగంటకొకసారి చొప్పున పదకొండు గంటల నుంచీ ఫోన్ చేస్తూన్న సంగతిని టెలిఫోన్ ఆపరేటర్ ఆయనతో చెప్పనేలేదు.

లీలామణి సుడిగాలిలా ఆఫీసు కొచ్చింది. వెంటనే పి. ఏ. గది కెళ్లింది. అక్కడ శాంతి కూర్చుని టైప్ చేసిన కాగితాలు వొరిజినల్స్‌తో పోల్చిచూస్తూ, తప్పులేమైనా వుంటే దిద్దుతోంది. లీలామణిని చూసి శాంతీ, శాంతిని చూసి లీలామణీ ఆశ్చర్యచకితులైనారు. అంతేకాదు లీలామణి మండిపడింది

"నాకు తెలీకుండా ఇక్కడ ఎప్పుడు చేరావే ?"

తల వంచుకుంది శాంతి.

"నీ భాగోతమంతా బట్టబయలైందే భడవా ! అక్కడ కుంటి మొగుణ్ణి ఇంట్లో పెట్టి, ఇక్కడ మా ఆయనతో కులుకుదామని వచ్చావా ? ఎన్ని గుండెలే నీకు !"

రోషంతో శాంతి తల పైకెత్తింది.

అప్పుడే అక్కడకు ఆఫీసు మేనేజరూ, సూపరింటెండెంటూ వచ్చారు. లీలామణి ఆకారాన్నీ, నోటి తొందరనూ చూసి గది మొదట్లోనే నిలబడ్డారు

అమ్మగారు వచ్చారని నర్సన్న చెప్పగా రఘునాథ్ ఆదరాబాదరా వచ్చి, ఆవిడ శాంతిని నానామాటలూ అంటూంటే నిలువుకళ్లతో నిలబడిపోయాడు గది అవతల.

"అందంతో, ఆకర్షణలో నా మొగుడ్ని వలలో వేసుకొని, నాకే ద్రోహం చేస్తావటే! ఎంత బరితెగించిపోయావే! నీకు నీతీ, జాతీ వుందా ? సిగ్గూ, నెత్తురూ వున్నాయా ? నీ వేషాలు కనిపెట్టే నేను ఆనాడు నీకు ఉద్యోగం ఇవ్వొద్దన్నాను మరి ఏం మాయంచేశావో, మత్తుమందు పెట్టావో, మురిపించావో ఉద్యోగం సంపాయించావు. ఆయన్ను నీపక్కకు లాక్కొని, హోటళ్లల్లో, గెస్టుహౌసుల్లో ఆయనకు వొళ్లు అప్పగించి, డబ్బు లాగుతున్నావు. ఛీ. ఈ బ్రతుకు బ్రతక్కపోతే ! ఈ నీచానికి వొడిగట్టకపోతే !..." ఆవిధంగా నలుగురిముందూ దులిపేసింది లీలామణి. ఆవిడకు కోపం వస్తే, అన్యాయం జరిగితే — మర్యాదలేం పాటించదు; నోటితీట తీర్చుకుంటుంది; రాద్ధాంతం చేస్తుంది ఆరోజు అలాగే జరిగింది.

అంతా వింటూకూడా రఘునాథ్ ఏమీ చేయలేకపోయాడు; నోరు విప్పలేకపోయాడు తన బ్రతుకునూ, పరువు ప్రతిష్టల్నీ అవినీతి చేష్టల్నీ తాను యజమానిగా వుంటూన్న ఆఫీసులోనే అందరి ముందూ బట్టబయలు చేసింది జీవితంలో అంతకంటె అవమానం ఏం కావాలి ? అది భరించలేక వెంటనే కారు వేసుకొని క్లబ్బుకు వెళ్లిపోయాడు రఘునాథ్ — ఆవిడ తన గదిలోకి అడుగు పెట్టకముందే.

లీలామణి మాట్లాడుతూన్నంతసేపూ శాంతికి

భూమి గుండ్రంగా తిరుగుతూన్నట్లే అనిపించింది ఆవిడ ఒక్కొక్క మాటా గుండెలో తుప్పు పట్టిన బల్లేలు గుచ్చుకున్నట్లే అయింది. ఎదురు మాట్లాడదామన్న ఆవేశం ఉవ్వెత్తుగా వచ్చిందిగానీ, గొంతు నుంచి మాటలు విడి రాలేదు కోపోద్రేకంతో మొహమంతా వొణికిపోయింది; ఎర్రబారింది.

లీలామణి గదిలోంచి వెళ్లగానే, చుట్టూ చూసింది. ఆఫీసు సిబ్బందంతా గుంపులు గుంపులుగా చేరారు. గుస గుస లాడుకుంటున్నారు

అవమానంతో, అసహ్యంతో శాంతి మనస్సు చిందరవందరైంది ఒక్క క్షణం అక్కడ నిలబడలేకపోయింది హ్యాండ్ బాగ్ పుచ్చుకొని వెంటనే వచ్చేసింది ఆఫీసంతా పెద్దపెట్టున నవ్వుతోన్నట్టు తోచింది ఆమెకు. వెనక్కు తిరిగి చూడలేదు.

తన బ్రతుక్కు ఆఖరి రోజు వచ్చింది!

తన జీవితంలో చివరి అధ్యాయం ముగియబోతోంది!

శరీరం నుంచి, ఆత్మను వేరుచేసి బ్రతుకుదామని తాపత్రయపడింది కేవలం అది మృగతృష్ణే! అందరూ చూసేది శరీరాన్నే, శారీరక సౌందర్యాన్నే; దాని అందాన్నే, లావణ్యాన్నే, అందులోని ఆత్మ సంగతి ఎవడికి పట్టింది? దాని విలువా, పవిత్రతా ఎవరికి కావాలి? తాను ఘోరంగా పరాజయం పొందింది; పరాభవాన్ని అనుభవించింది. ఆత్మ ఎన్ని తప్పులైనా చేయవచ్చు; ఆత్మలో ఎంత విషాన్ని అయినా నింపుకొని ప్రవర్తించవచ్చు, ఆత్మలో ఎంత అపవిత్రతనైనా దాచుకోవచ్చు. అది బాహ్య ప్రపంచానికి కనపడదు కాబట్టి, దానితో ఎవ్వరికీ అవసరంలేదు కాబట్టి దాని దోషాల్ని గురించీ ఎవ్వరూ పట్టించుకోరు శరీరం ఏ తప్పుచేసినా, ఏ తప్పటడుగు వేసినా, ఏ మాలిన్యాన్ని పులుముకున్నా, ఈ ప్రపంచం వేలెత్తి చూపుతుంది; అక్రమంగా ప్రవర్తించినట్టు, అవినీతికి పాల్పడ్డట్టు; పవిత్రతను కోల్పోయినట్టు - దూషిస్తుంది. ఆర్థిక పరిస్థితుల ప్రభావం దృష్ట్యా తన మనస్సుచేత తానే దారుణంగా వంచించబడింది. ఆ వంచన ఫలితమే తాను యిలా నైతికంగా, సామాజికంగా జీవితంలో పతనం చెందడం. తాను మనస్సును చంపుకొని మరగా మారిందనీ, ఆ మరకు నీతీ, అవినీతీ, పవిత్రతా, అపవిత్రతా అంటవనీ భ్రమపడింది ఆ భ్రమే తన బ్రతుకును చరమదశకు తీసుకొచ్చింది! ఆత్మను ఏనాడో చంపుకుంది. శరీరాన్ని ఈనాడు చంపుకోబోవడంలో – 'థ్రిల్' ఏమీ లేదు, రవ్వంత బాధపడాల్సిన అవసరంలేదు; ఆలోచించే అగత్యమే లేదు ... అనుకొంటూ శాంతి బస్సుస్టాప్ దగ్గర కొచ్చింది

బస్సులో ఎక్కి కూర్చుంది శాంతి కిటికీ పక్కగా. చావడానికి నిర్ణయించుకొన్న తర్వాత ఆమెకు ఎంతో రిలీఫ్ వచ్చినట్లయింది ముసిముసి నవ్వులు నవ్వుకుంది అప్రయత్నంగానే. లోపల మనస్సు సంతోషంతో పొంగిపోయింది. ఆమె మొహంలో తీవ్రమైన తెగింపుతో కూడుకున్న నిర్ణయం తాలూకు ప్రసన్నత కొట్టవచ్చినట్టు కనబడుతోంది

బస్సు బయలుదేరింది.

ఆమెలో హఠాత్తుగా ఓ ఆలోచన నిక్కబొడుచుకొచ్చింది. తాను చనిపోతే! రావ్, నీలూ – వీళ్లేమవుతారు? వాళ్ల గతేమిటి? రావ్ అవిటివాడు. మంచంమీద నుంచి లేవాలంటే మరో చేయి కావాలి. నీలూ చిన్నది, పసిది. వీళ్లు ఎలా బ్రతుకుతారు?

అంతలోనే బస్సు ఒక స్టాప్ దగ్గర ఆగింది. కిటికీలోంచి బయటకు చూసింది శాంతి.

ఓ ఏడేళ్ల ఆడపిల్ల, చినిగిన దుస్తులతో, చింపిరి దుస్తులతో – ఓ కాలూ, చేయీ లేని అవిటివాడి చేయి పుచ్చుకొని, 'అయ్యా! బాబూ! మా అయ్య కుంటోడండి తలో పైసా ఇయ్యండి' అంటూ అడుక్కోవడం కనబడింది.

శాంతి మనస్సు దెబ్బతిన్న పక్షిలా గిలగిలా తన్నుకుంది.

— తాను చనిపోతే, రావ్, నీలూ గతి అంతే కామోసు! అనుకుంది శాంతి. ఆ భావన రాగానే ఆమె హృదయం తీవ్రమైన వ్యథతో మూలిగింది.

తాను వ్యక్తిగతమైన స్వార్థాన్ని చూసుకొని ఆత్మహత్య చేసుకొంటే, ఈ లోకపు అపహాస్యాన్నుంచీ, చేచేతులారా చేసుకొన్న చేష్టల దుష్ఫలితాలకు భయపడి పారిపోతే – తనపై ఆధారపడిన వాళ్ల గతేమిటి? వాళ్లకో మార్గాన్ని చూపాల్సిన బాధ్యతా, కర్తవ్యమూ తనపై లేవా? ఒకప్పుడు జీవితమంటే సిమెంట్ రోడ్డుపై పోయే కొత్త కారు వంటిదని భావించిన రావ్, ఆ రోడ్డుమీదనే అవిటివాడై ఇప్పుడు అడుక్కోవాలా? తల్లిదండ్రుల ఆదర్శ దాంపత్యానికి చిహ్నంగా జన్మించిన, అన్నెమూ పున్నెమూ ఎరుగని పసిహృదయం, నీలూ అయిదేళ్లకే పొట్టకూటికి 'అయ్యా! బాబూ!' అంటూ వీధులవెంట తిరిగి అడుక్కోవాలా? తాను చనిపోయిన మరుక్షణం నుంచీ వాళ్ల జీవన గతి అంతేగా! ... తీవ్రాతి తీవ్రంగా ఆలోచించ సాగింది శాంతి వాళ్లకూ ఓ పరిష్కారమార్గాన్ని చూపెట్టడానికి.

బస్సు దిగింది శాంతి.

మొహాన నెత్తురు పులుముకున్నట్టుగా వుంది శ్రావణసంధ్య.

బరువుగా నడిచి ఇంటికి వచ్చింది. దగ్గరగా వేసివున్న వీధి తలుపును తెరుచుకొని లోపలకు వచ్చింది.

ఎదురుగ్గా భీకరమైన ఆకారంతో మంచం మీద కూర్చునివున్నాడు రాంమోహన్. అతన్ని చూడగానే భయమేసి, అంత దూరంలోనే నిలబడిపోయింది శాంతి.

"శాంతీ! ఎంతపని చేశావ్?" గర్జిస్తూ కోపావేశాన్ని నిల్దొక్కుకోలేక, మంచం పక్కనే వున్న చేతికర్రను బలంగా ఆమె మీదకు విసిరివేశాడు

శాంతి మెలకువగా తప్పుకోకపోతే ఆ కర్ర ఆమె నుదురుమీద తగిలేదే!

భర్తకు అంత ఆగ్రహం రావటానికి కారణం– తన విషయం తెలిసివుండటమే అనుకుంది కాని తాను బ్రతికుండగా ఈ రహస్యం భర్తకు తెలిస్తే

(30వ పేజీ చూడండి)



**ఆదివారం మధ్యాహ్నం, వీధి అరుగుమీద కూర్చుని నరసింగరావ్, ఇంటికి వచ్చిన స్నేహితుడితో కలిసి చదువుకొంటున్నాడు. లోపల అతని తల్లి చేస్తున్న లడ్డూల ఘుమ ఘుమలు వీధరుగు మీద కూర్చున్నవాళ్ల నోరూరిస్తున్నాయి.**

# మరిది

***"సింహం" అన్న కేక వినగానే లోపలికి పరిగెత్తాడు. "ఇంద తీసుకో!" అని ఒక లడ్డూని కొడుకు చేతిలో పెట్టింది అన్నపూర్ణమ్మ. నరసింగరావ్‌కి మరోటి కావాలి. తను తన స్నేహితుడింటికి ఎప్పుడు వెళ్లినా అతను తన్ని ఇంట్లోకి తీసుకు వెళ్తాడు. వాళ్లమ్మ ఏమన్నా చేస్తే ఇద్దరికి పెడుతుంది. కాని అతనెప్పుడు తన యింటికి వచ్చినా అమ్మ "అందరిని ఇంట్లోకి తేకు" అంటూ కోప్పడుతుంది. అందుకనే తను అతన్ని వీధరుగుమీద చాప వేసి కూర్చోబెడ్తాడు. కాని ఇవాళ లాభం లేదు. వాసనబట్టి అతను, అమ్మ లడ్డూలు చేసిన విషయం పోల్చుకొనే ఉంటాడు. ఇవాళ అతనికి పెట్టకుండా తింటే తనకే చిన్నతనం.***

"అమ్మా! ఇంకోటి ఇవ్వవా?" అని అడిగాడు.

"పిచ్చి వెధవా! ఇక్కడే తినేసి పో! వీధిలోకి వెళ్లి తినకు! లేకివెధవ లెవరైనా అడిగినా అడుగుతారు" మరో లడ్డూ ఇస్తూ అన్నపూర్ణమ్మ, నరసింగరావ్‌ని హెచ్చరించింది. నరసింగరావ్ అల్లానే అని తలూపి రెండూ తినేసినట్లు నటించి వీధిలోకి జారుకొని, స్నేహితుడి చేతిలో ఒకటి పెట్టాడు.

చదువుకోవటం పూర్తయ్యాక ఇంటికి వెళ్తున్న స్నేహితుడిని సాగనంపడానికి నరసింగరావ్ గేటుదాకా వెళ్లాడు. అతన్ని పంపించి వెనక్కు తిరిగిన నరసింగరావ్‌కి తన యింటి ముందర పెట్టె బండీ ఆగటం అందులోంచి చిన్న తాతయ్య కూతురు నర్సమ్మత్త, ఆమె కూతుర్తో సహా దిగటం కనిపించింది. నరసింగరావ్ లోపలికి పరుగెత్తుకొని వెళ్లి "అమ్మా! నర్సమ్మత్తొచ్చింది" అని తల్లికి కబురు చెప్పి పెరట్లోకి వెళ్లాడు. అక్కడ పూలు ఏరుతున్న నాయనమ్మని వీధిలోకి లాక్కువచ్చాడు.

అప్పటికే నర్సమ్మ సామాన్లు ఇంట్లో పెట్టించేసి బండి అబ్బాయికి డబ్బులిచ్చి పంపేసింది.

"రావే! నీ మొగుడ్ని విడిచిపెట్టేసి..."అంటూ లక్ష్మమ్మ ఆప్యాయంగా నర్సమ్మని పలకరించింది.

"పో దొడ్డమ్మా! నువ్వు మరీను. నాకు పెళ్లయి పదేళ్లయిందని మర్చిపోతావ్. మొగుడ్ని వదిలెట్టేసి ఎక్కడికేనా పారిపోదాం అనుకునే వయస్సొచ్చేసింది నాకు. ఇంతకూ వదినేది?"

"అది వంటింట్లో ఏదో చేస్తోంది."

వంటింటికేసి నడిచింది నర్సమ్మ. అత్త వెనకాతలే వెళ్లిన నరసింగరావ్ వంటిల్లు చూసి ఆశ్చర్యపోయాడు. అరగంట క్రితం ఆ గదిలో తన తల్లి పిండివంట చేసిన చిహ్నాలేవీ అక్కడ లేవు. కొట్టు గదిలోంచి చెయ్యి తుడుచుకొంటూ వచ్చి, అన్నపూర్ణమ్మ "ఏవమ్మా నర్సమ్మా! బాగున్నావా? విజయనగరం వెళ్తూ దిగావా?" అని పలకరించింది.

"అవునొదినా! అమ్మని చూసి రెండేళ్లవుతోంది. రెండేళ్ల క్రితం పెదనాన్న పోయినప్పుడొచ్చానా మళ్లీ రాలేదు. దొడ్డమ్మని కూడా ఓసారి చూసేసి పోదామనిపించి దిగాను."

"లేకపోతే నన్ను చూద్దామని దిగావనుకున్నానా ఏమిట్లే!"

అన్నపూర్ణమ్మ నిష్ఠూరమాడ్తోందో, వేళాకోళమాడ్తోందో నర్సమ్మకి తెలియలేదు. ఉండే రెండ్రోజుల భాగ్యానికి ఎత్తిపొడుపు మాటలు అనుకోడం ఎందుకని నర్సమ్మ జవాబివ్వలేదు.

"కాఫీ యివ్వనా?" అని అన్నపూర్ణమ్మ అడిగింది.

"అన్నయ్యని రాని, ఏకంగా కలుపుదువుగాని" అంది నర్సమ్మ.

నరసింగారావ్ తండ్రి శివరామయ్య ఆరోజు ఆఫీసునుంచి ఆలస్యంగా వచ్చాడు. అన్నయ్యని చూసే బయల్దేర్దామని నర్సమ్మ అనుకోడంతో ఆపూట కామె ఆగిపోవాల్సి వచ్చింది. మర్నాడు పొద్దున్నే లేచి విజయనగరం ప్రయాణం పెట్టుకుంది. అంతకుపూర్వం, ఆమెప్పుడు విశాఖపట్నం వచ్చినా రెండ్రోజు లుండే విజయనగరం వెళ్లేది. కాని యీసారామెకు వుండాలనిపించలేదు. అన్నపూర్ణమ్మ మాటలు తీరామెను బాధపెట్టింది.



పూర్వంలాగా లక్ష్మమ్మ కోడల్ని గదమాయించలేక పోతోందన్న విషయం గమనించింది పెత్తండ్రి పోయాక పెత్తనం చేతులుమారి వుంటుందని సులభంగానే ఊహించింది మనుష్యుల నిజస్వరూపాలు అణిగి వున్నప్పుడు కనిపించవు అధికారం చేతిలోకి వచ్చినప్పుడే బయటపడ్తాయి!

"నాకు స్వంత ఆడబడుచులంటూ ఎవరూ లేరుకదా! నువ్వే నాకాడబడుచువి" అంటూ మన్నించి మర్యాద చేసిన అన్నపూర్ణమ్మ యిప్పుడిలా మారిందంటే కారణం, తన పెత్తండ్రి బతికుండగా ఉన్న భయం లేకపోవడమే అనుకుంది నర్సమ్మ.

"వెళ్తాన్నయ్యా!" అంది కాఫీల దగ్గర నర్సమ్మ.

"రెండ్రోజులుండిపో" అన్నాడు మామూలుగా శివరామయ్య

"రెండ్రోజుల్లో వెనక్కి వెళ్లిపోవాలి ఈలోపు అమ్మనికూడా చూడాలికదా."

"ఇంకో రోజైనా వుండవే!"

"వీలవదు దొడ్డమ్మా!"

**పాఠకుల**
**బ్యాలట్‌కోసం వేస్తున్న**
**మూడవ సీరియల్ కథ**

"నువ్వు చెప్పు అన్నపూర్ణా! నువ్వు చెప్తే ఉంటుంది"

"తనకి వీలైతే ఎందుకుండదు పూర్వం ఎన్నోసార్లుండలా? తనకి పనులున్నాయంటుంటే మనం బలవంతం పెట్టటం ఏం ధర్మం? తనకి



తల్లిని చూడాలని వుంటుందికదా! చూడు నర్సమ్మా! యిప్పుడు వెళ్తే వెళ్ళగాని, తిరిగి వెళ్లేటప్పు డిక్కడ దిగి ఓ పూటుండి మరీ వెళ్లాలి తెలిసిందా ?'' అంది అన్నపూర్ణమ్మ.

ఓ పూట అనడంలో 'ఇది మాటవరసకి పిలిచిన పిలుపు. నిజమనుకుని దిగిగలవ్! దిగినా, రోజుల్తరబడి వుండేలా రాకు' అన్న అర్థం స్ఫురించింది నర్సమ్మకి.

''అల్లాగే వదినా! వీలైతే ఓ పూట వుండే లాగానే వస్తాను. రాకపోతేమాత్రం ఏమనుకోకు. సింహంచేత బండి తెప్పిస్తే వెళ్తాను.''

''స్నానం అయినా చెయ్యకుండా ప్రయాణం ఏమిటే'' అని లక్ష్మమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

''ప్రయాణంలో ఎల్లాగో దుమ్ము పడ్తుంది. ఏకంగా ఇంటికి వెళ్లి స్నానంచేస్తాను. సింహం! కొంచెం బండి తెచ్చిపెట్టు.''

నరసింగరావ్ బండి తేగానే నర్సమ్మ కూతుర్ని, సామాన్ని తీసుకొని బండెక్కింది. లక్ష్మమ్మ యింక వూరుకోలేక ''ఒరేయి శివుడూ! చెల్లెలికో రవిక ముక్కైనా పెట్టకుండా బండెక్కిస్తావురా!'' అంది కొడుకుతో. శివరామయ్య జేబులోంచి ఇరవై రూపాయలు తీసి చెల్లెలి చేతిలో పెట్టి, ''టైము లేకపోవడంచేత బజారుకెళ్లి ఏమీ తీసుకురాలేక పోయాను'' అన్నాడు నొచ్చుకొంటూ.

''అభిమానాలు పెట్టుపోతల్తో కొలుస్తామా అన్నయ్యా ?'' అంది నర్సమ్మ

''నువ్వు డబ్బిచ్చినంత మాత్రాన నీకు నామీద అభిమానం వుందని అనుకోను'' అని అర్థమా, లేక ''ఇవ్వకపోయినా నీకు అభిమానం లేదని అనుకోను'' అని అర్థమా అని ఆలోచిస్తూ నిలబడి పోయాడు శివరామయ్య

నర్సమ్మ బండిలో వెళ్లిపోయింది.

ఎనిమిదిగంటల వేళ ''మీరు ఆఫీసుకు వెళ్లేటప్పుడు ఇంట్లో ఓ రెండ్రూపాయలిచ్చి మరీ వెళ్ళండి నూనె తెప్పించుకోవాలి'' అని చెప్పింది మొగుడితో అన్నపూర్ణమ్మ.

''మొన్ననేకదూ తెప్పించావ్!''

''మొన్న కొంత ఆవకాయలో తక్కువైతే పోసాను నిన్న లడ్డూల్చేసాను. అయిపోయింది.'.

''యుద్ధం రోజుల్లో వస్తువుల్దొరక్క చస్తుంటే లడ్డూల్చేసావా ?''

''ఆదేమిటి అన్నపూర్ణా! క్షురముండ చేతిలో అయినా ఒకటి పెట్టావ్‌కావు!'' అంది లక్ష్మమ్మ లడ్డూల విషయం గుర్తుకురాగానే!

తల్లి ఎందుకు పెట్టలేదా అని నరసింగరావ్ కూడా నిన్నట్నుంచి ఆశ్చర్యపోతున్నాడు. పూర్వం నర్సమ్మత్త వచ్చినప్పుడల్లా నాయనమ్మ పెద్ద ఆర్భాటంచేసి ప్రత్యక్షంగా పిండివంటల్చేసి పెట్టేది. కాని ఈసారి తన తల్లి ప్రత్యేకంగా ఏమీ చెయ్యక పోయినా చేసినవైనా పెట్టలేదేమా అనుకున్నాడు.

''కొంచమే చేసాను. సింహం రోజు, స్కూలు నుంచి ఆవురావురుమంటూ వస్తాడు రోజూ ఏదో ఒకటి చెయ్యటం కష్టం కదా! లడ్డూలు చేసి దాస్తే రోజూ వాడికోటి పెట్టొచ్చుని అనుకున్నాను. అల్లా అయితే ఓ పది రోజులు వస్తాయనుకున్నాను. ఆ కాసిని, ఇంటికొచ్చిన వాళ్లందరికీ పెట్టడం మొదలుపెడ్తే ఓ రోజు కూడా రావు. మనం జమిందార్లం కాముకదా! పైగా బండి ఎక్కేటప్పుడు చేతిలో పెట్టేవి ఎల్లాగో తప్పవు'' అంది.

అన్నపూర్ణమ్మ మాటలకి శివరామయ్య జవాబివ్వలేదు. కాని లక్ష్మమ్మ ఊరుకోలేకపోయింది. ''ఇదేం చోద్యమమ్మా! మనకున్నదాంట్లో మనకు వీలైనంత నలుగురికీ పెట్టి మనం తినడం గృహస్థులమైన మన ధర్మం.''

''అవన్నీ నమ్మే మీరు మాకు ఈ యిల్లు తప్ప ఏమీ మిగల్చలేకపోయారు మేమూ మీలాగే చేస్తే సింహానికీయిల్లు గూడా మిగలదు. ఇల్లు గుల్లయి పోతుంది.''

''నాకు తెలియకడుగుతాను మరి, కిందటేడు మీ అన్నయ్య పిల్లలు వచ్చినప్పుడు, ఎందు కంత ఆర్భాటం చేసావ్? అప్పుడు ఇల్లు గుల్లయిపోతుందని గుర్తు లేదా? నేనుగాని, నా కొడుకుగాని మావాళ్ళా, మీవాళ్ళా అని ఎప్పుడూ ఆలోచించలేదు. అందరు బంధువులు మనవాళ్లే అనుకున్నాం. నువ్వలా కాదు ''

''అవును మావయ్యవాళ్లు వచ్చినప్పుడమ్మ చాలా మర్యాదలు చేసింది'' అనుకున్నాడు నరసింగరావ్.

## యువతరం

ఎస్. రవిశంకర్ విజయవాడ శాతవాహన కాలేజీలో బి. కామ్. చదువుకుంటున్నాడు. కాలేజీ డిబేట్‌లలో తెనుగు వక్తృత్వంలో ప్రయిజులు సంపాదించు



కున్నాడు — ఫుట్‌బాల్ ఆట అంటే సరదా కాని ఆడటానికి ఎక్కువ అవకాశాల్లేక ఆడటం లేదు అన్నాడు. పద్దెనిమిది సంవత్సరాల యీ విద్యార్థికి పాత సినీమాలే నచ్చుతాయి. కొత్త సినిమాలో కథ చెప్పే చాతుర్యం వుండటంలేదట. హంగులు ఎక్కువ, సరకు తక్కువ అనుకుంటున్నాడు, యీ కాలపు సినిమాల గురించి. నటీమణు లెవరూ యితనికి ప్రత్యేక అభిమానులు లేరుగాని నటులలో ''అక్కినేని'' అంటే యిష్టం. ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిగారంటే గౌరవం. విశ్వనాథ సత్యనారాయణగారన్నా అభిమానం ఎక్కువేనట కాని వేయిపడగలంతా అర్థం కాలేదు — ఇతనికి అత్యవసర పరిస్థితి ఎంతో బాగుంది. దేశంలో కొంత క్రమశిక్షణ వచ్చింది కొంతైనా అవినీతి పోయింది, అని ఆనందంగా చెప్పాడు. కాని అతని కింకో గట్టి బలమైన కోరిక వుంది — ''మద్యపానాన్ని ఎత్తేయాలి తిరిగి ప్రొహిబిషన్ పెట్టాలి'' అంటాడు. జీవితంలో ఏ ఆశయం మాట ఎలా వున్నా 'త్రాగటం' మాత్రం యీ జన్మలో చేయను అన్నాడు శంకర్. ఆహారం అలవాట్లు మార్చుకోడం కష్టమే నన్నది అతని అభిప్రాయం. [ వీరాజీ ]

## పరిధి

''నేను, నావాళ్లు మీవాళ్లు అనే ఉద్దేశంతో మాట్లాడటంలేదు. రోజులు నానాటికి గడ్డురోజులై పోతున్నాయి, ఇందాక మీ అబ్బాయి అన్నట్టు. పైగా అన్ని దరిద్రాలు విశాఖపట్నంలోనే ఉన్నాయి. పడమటన డబ్బు పెడ్తే అన్నీ దొరుకుతాయి, పండుతాయి. ఇక్కడ అన్నింటికి రేషనే! అందుకని బంధువులంటూ అందర్నీ పోగేస్తే మన గడ్డి మనం తినాలి. ఇల్లు నడిపే మగవాడి తల్లిదండ్రులు, తోబుట్టువులు, వాళ్ల కుటుంబాలు, ఇంట్లో చాకిరి చేసే ఆడదాని తల్లిదండ్రులు, తోబుట్టువులు వాళ్ళ కుటుంబాలు, వాళ్లే బంధువులు. అంతేగాని ఎవర్నో తీసుకువచ్చి నీ ఆడబడుచని మీరంటే నేనెల్లా అనుకోను'' అంటు 'తనవాళ్ల'కి నిర్వచనం ఇచ్చింది అన్నపూర్ణమ్మ

''నర్సమ్మ ఎవరో ఎలా అవుతుందే. అది సాక్షాత్తు మీ చినమావగారి కూతురు. చెయ్యడానికి నీకు వేరే ఆడబడుచులంటూ లేరు కదా! మీ మావగారు బతికున్నంతకాలం దానికీ యింట్లో ఆడబడుచు స్థానం నీతోసహా అందరం ఇచ్చాం. ఆ విషయం నువ్వు మర్చిపోయుండవు. అల్లాంటిది ఉన్నట్టుండి నర్సమ్మ పరాయిదైపోయిందా ?''

''అప్పటికి ఇప్పటికి తేడా. అప్పుడు మావగారు బతికున్నారు. ఇప్పుడు లేరు. అప్పుడు యిల్లు నడిపే యజమాని ఆయన. అందుకని ఆ రోజుల్లో ఈ యింటికి రావటానికి పోవడానికి, ఆయన అన్నదమ్ములకి, వాళ్ల పిల్లలికి హక్కుంది. కాదనటానికి మధ్య నేనెవరు? ఇప్పుడాయన లేరు. అది గ్రహించి, వాళ్ళు రావటం మానుకోవాలి. తప్పనిసరై వచ్చినప్పుడు పూర్వంలా మర్యాదలు జరగటంలేదని అనుకుని లాభం లేదు.''

''నీ మొగుడికి తోబుట్టువుల్లేరనీ నీ కున్నారనేగా ఈ మిడిసిపాటు.''

''మీరెల్లా అనుకున్నా సరే. ఆయనకి తోబుట్టువుల్లేని కొరత తీర్చడానికిగాను ఆయనకి అన్నదమ్ముల, అప్పచెల్లెళ్ల వరస అయిన వాళ్ళందర్నీ పోగేసి నేను చాకిరి చెయ్యను.'' అని అన్నపూర్ణమ్మ కుండ బద్దలుకొట్టి చెప్పింది. ఆపైన నూనె మాట గుర్తుకు వచ్చి

''అన్నట్టు రెండ్రూపాయ లివ్వండి'' అని అన్నపూర్ణమ్మ శివరామయ్యని అడిగింది.

''లేదు'' అన్నాడతను బుర్ర గోక్కుంటూ.

''అయితే బడాయికి పోయి జేబులో ఉన్నదంతా ఆవిడగారి చేతిలో పెట్టారన్న మాట!''

## 2

లక్ష్మమ్మ పోయిన మరుసటేడు అన్నపూర్ణమ్మకి కనకమహాలక్ష్మి పుట్టింది. తనకంటే పన్నెండేళ్లు చిన్నదయిన లక్ష్మంటే నరసింగరావ్‌కి ముద్దే. కాని తల్లిగాని తండ్రిగాని తన్ని మరీ పెద్దవాడిగా చేసి మాట్లాడ్తుంటే నరసింగరావ్‌కి నచ్చేది కాదు. ఏకధాటీగా తన ముద్దు సాగటంవల్ల నరసింగరావ్‌కి లక్ష్మి అప్పుడప్పుడు పోటీదారురాలులాగా కనిపించేది.

లక్ష్మికి తనకంటే అయిదేళ్లు పెద్దదయిన ఓ స్నేహితురాలుండేది. ఆ పిల్ల పేరు సుభద్ర. లక్ష్మి వయస్సుకు మించిన క్లాసు చదవటంవల్ల,

సుభద్ర కొంచెం వెనకబడటంవల్ల సుభద్ర లక్ష్మి కంటే రెండు క్లాసులు పైన చదువుతుండేది. సుభద్రకి పధ్నాలుగు సంవత్సరాలు వచ్చినప్పటిమంచి, నరసింగరావ్ రాజకుమారిడిలాగా కన్పించసాగాడు. వీలైనంతవరకు లక్ష్మి కోసం నరసింగరావ్ ఉన్న సమాయాల్లోనే వాళ్లింటికి వెళ్లేది. అతని గురించి లక్ష్మి ఏమన్నా చెప్తే ఆసక్తితో వినేది. నరసింగరావ్ ఎమ్మే పాసై యూనివర్సిటీలో లెక్చరర్‌గా జేరేసరికి సుభద్రకి పదహారేళ్లు నిండి ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతోంది

లక్ష్మిని ఎప్పుడైనా నరసింగరావ్ సినిమాకి తీసుకువెళ్లేవాడు. అది గమనించిన సుభద్ర "నాకు పెద్దమనుషులు సినిమా చూడాలని ఉందోయి. నువ్వెళ్తే నేనూ వస్తాను" అంది.

"మా అన్నయ్య నడగాలి" అంది లక్ష్మి అమాయకంగా.

"అడుగు" అంది సుభద్ర గడుసుగా.

మర్నాడు లక్ష్మి నరసింగరావ్‌ని "పెద్ద మనుషులు సినిమా చూద్దామా ?" అని అడిగింది.

"ఆలోచిద్దాం" అన్నాడు.

"మనం వెళ్తే సుభద్ర కూడా వస్తుందిట."

"మధ్యలో సుభద్రెందుకూ ?" నరసింగరావ్ భయపడ్డాడు.

మరో మనిషికి కూడా తను టిక్కెట్టు కొనాల్సి రావచ్చునని. తనతో వచ్చినప్పుడు ఆ పిల్ల దగ్గర డబ్బు తీసుకోడం కష్టంకదా అనుకున్నాడు.

"సుభద్ర మనతో రావాలని సరదా పడ్తోంది."

నరసింగరావ్ ఆశ్చర్యంగా చూసాడు. అన్నయ్య మాట్లాడకపోవడం చూసి "సుభద్రకి నువ్వంటే చాలా యిష్టం" అంది. అన్నాక నాలిక కరుచుకుంది. సుభద్ర, లక్ష్మితో తనకి నరసింగరావ్ అంటే చాలా యిష్టమని చెప్పి ఆ విషయం లక్ష్మి నరసింగరావ్‌తో చెప్పొలనే కోరికతో "మీ అన్నయ్యతో చెప్పద్దు" అని ఆంక్ష పెట్టింది. నరసింగరావ్ మరింత ఆశ్చర్యపోయి "ఎవరు చెప్పారీకు ఆ విషయం ?" అని అడిగాడు

"నేనే అల్లా అనుకున్నాను."

"ఎందుకని ?"

"గుర్తు లేదు."

"నిజం చెప్పు. నిజం చెప్పకపోతే సినిమాకి తీసుకెళ్లను."

"సుభద్రే చెప్పింది. నీతో తనన్నట్టు చెప్పద్దంది"

"బావుంది" అని నరసింగరావ్ అక్కడ్నుంచి వెళ్లిపోయాడు.

రెండ్రోజులు పోయాక "ఇవాళ పెద్దమనుషులు సినిమాకి వెళ్దాం" అని చెప్పాడు నరసింగరావ్ లక్ష్మితో.

"సుభద్రతో చెప్పేదా ?"

"నీ యిష్టం" అల్లా అన్నాడేగాని లక్ష్మి చెప్పదేమోనని భయపడ్డాడు. సుభద్రకి తనంటే యిష్టం అని తెలిసినప్పటినుంచి, సుభద్రపట్ల అతనికి కుతూహలం రేకెత్తింది. కాని మాటిగా సుభద్రని కూడా తీసుకురా అని లక్ష్మితో చెప్పలేక పోయాడు. సాయంత్రం వరకు సుభద్ర రాదేమోనని నరసింగరావ్ మనసు పీకుతూనే ఉంది. సాయంత్రం సుభద్రని చూడగానే నరసింగరావ్ మొహం వికసించింది. నరసింగరావ్‌తో వెళ్లబోతున్నాకదా అని సుభద్ర జాగ్రత్తగా తయారై మరీ వచ్చింది సినిమాకి.

రెండు నెలలు తిరిగేసరికి ముగ్గురూ కలిసి మూడు సినిమాల్చూసారు. ఇప్పుడు సుభద్ర, నరసింగరావ్‌తో ధైర్యంగా ముఖాముఖి మాట్లాడ్తోంది. ఒకసారి నరసింగరావ్ సినిమాకి వెళ్దామని సూచించిన రోజు సుభద్రకి వీలవకపోతే "పోనీ రేపు వెళ్దాం" అంటూ వాయిదా వేసాడు నరసింగరావ్. లక్ష్మి కది వింతనిపించింది.

తనని అభిమానించే సుభద్రలో నరసింగరావ్‌కి రోజు రోజూ అందాలు కనిపించసాగాయి. లక్ష్మిని పావుగా పెట్టుకొని యిద్దరూ పరిచయం పెంచుకున్నారు. లక్ష్మి చిన్నపిల్లవటంతో జరుగుతున్న కథ అర్ధం చేసుకోలేకపోయింది.

ఓ రోజు సాయంత్రం లక్ష్మి సుభద్ర యింటికి వెళ్తే వాళ్లవాళ్లు "నువ్వు సుభద్రతో సినిమాకి వెళ్లలా ?" అని అడిగారు.

"లేదే ! సుభద్ర వెళ్లిందా ?" అని అడిగింది. వాళ్లు మౌనంగా తలూపారు.

ఆ ప్రైములో సుభద్ర నరసింగరావ్‌తో

**దీపావళి కథలపోటీలో ఎన్నికైన కథ**

సినిమా చూస్తోంది. ఆ సినిమా ఇంగ్లీషు సినిమా. ఆ క్రితం రోజు సుభద్ర లక్ష్మి కోసం లక్ష్మివాళ్ల ఇంటికి వెళ్లింది అప్పుడు నరసింగరావ్,

"ఇంగ్లీషు సినిమా ఉంది వెళ్దామా ?" అని సుభద్రని అడిగాడు.

సుభద్ర తలూపింది. "ఆరున్నర గంటలకల్లా సరస్వతీ హాలు దగ్గరికి రా. అక్కడ కలుసుకుంటాను."

"లక్ష్మి రావడంలేదా ?"

"ఇంగ్లీషు సినిమాలు దానికేం అర్ధమౌతాయి?" అని నరసింగరావ్ కొట్టిపారేసాడు.

సుభద్ర నరసింగరావ్‌తో వంటరిగా సినిమా చూడటం గురించి ఇరవైనాల్గు గంటలు ఊహాలోకాల్లో తేలిపోతూ గడిపింది.

అంత మధురంగా ఇరవై ఏడు గంటలు గడిపిన సుభద్రని ఇంటి దగ్గర పెద్దలు "సినిమాకి ఎవరితో వెళ్లావ్ ?" అని నిలదీస్తే.

"లక్ష్మివాళ్లతో" అంది.

"వాళ్లెవరు ?"

"వాళ్లన్నయ్య"

"వాళ్లన్నయ్యతో వెళ్లావేమోగాని లక్ష్మితో కాదు లక్ష్మి ఇక్కడికి వచ్చింది నువ్వెళ్లాక. వాళ్ల అన్నయ్యతో వెళ్లావా ?"

"వెళ్లాను."

"వయసొచ్చిన పిల్లవి నీకు వెళ్లడానికి సిగ్గులేదు వెళ్లానని చెప్పడానికి భయం లేదు. మీ రిద్దరు సినిమాకి వెళ్లిన విషయం వాళ్ల కాలేజి కుర్రాళ్లు గాని మీ కాలేజీ పిల్లలుగాని చూస్తే మన వంశ గౌరవం ఏమైపోవాలి ? ఆడపిల్ల అరిటాకులాంటిదని, మొగపిల్లాడు ముల్లులాంటివాడని అన్నారు. ఆఖరికి మచ్చంటూ పడితే అది నీకే" నన్నారు. వాళ్లని అన్నీ అననిచ్చి "నేను నరసింగరావ్‌ని పెళ్లి చేసుకొంటాను" అంది ధైర్యంగా.

"అతను నిన్ను చేసుకోవద్దూ !"

"మీరు వెళ్లి అడగకపోతే ఎల్లా చేసుకొంటాడు ?"

సుభద్ర తెగువకి వాళ్లాశ్చర్యపోయారు. విషయం నలుగురి నోళ్లలోను పడకముందే జాగ్రత్త పడదామని, మొట్టమొదట మంచి రోజున వెళ్లి నరసింగరావ్ తల్లిదండ్రులతో మాట్లాడారు వాళ్లడిగిన కట్నాలు కామకలు చెల్లివ్వగలిగినవే కావటంచేత ఓ నెల రోజుల్లో సుభద్రకి మూడు ముళ్లూ పడి, చదువాగిపోయింది. సుభద్ర తనకి వదిన కావటాన్ని లక్ష్మి చాలా హర్షించింది. పెళ్లి కాకమునుపు అన్నయ్య, సుభద్రని విడిగా సినిమాకి తీసుకువెళ్లాడని పెద్దవాళ్ల మాటలబట్టే అర్ధం చేసుకొంది

పెళ్లయిన అయిదో రోజున, నరసింగరావ్, సుభద్ర సినిమాకి వెళ్తూ తనని రమ్మనలేదని లక్ష్మి ఉడుక్కుంది.

"పానకంలో పుడకలాగా మధ్య నువ్వెందుకే !" అంది నవ్వుతూ అన్నపూర్ణమ్మ.

"ఏం మొన్న మొన్నటివరకు సుభద్రకి తను సినిమాకి వెళ్లడానికి నేను కావల్సి వచ్చాను. ఇవాళ మాట వరసకైనా రమ్మన్లేదు తను, నన్ను అన్నయ్య మాత్రం అన్నాడా ? అన్నయ్యకి నాకంటే సుభద్ర దగ్గర్దయిపోయిందా ? ఈసారి వాళ్లు రమ్మంటే మాత్రం నేను వెళ్తాననుకున్నావా ?" అంది లక్ష్మి రోషంగా

"వాడికి సుభద్రెంత దగ్గర్దో రేపు నీకు మొగుడొస్తేగాని అర్ధం కాదులేవే !" అంది అన్నపూర్ణమ్మ నవ్వుతూనే తల్లి నవ్వు చూస్తుంటే లక్ష్మికి వళ్లు మండింది.

"నేను పెళ్లి చేసుకోను" అని గట్టిగా అరిచి తన గదిలోకి వెళ్లి తలుపులు వేసుకొంది.

## 3

కాలేజీ నుంచి అలిసిపోయి, వడిలిపోయిన తోటకూర కాడలాగా తయారై వచ్చింది లక్ష్మి. వస్తూనే కనీసం సబ్బుపెట్టి మొహం అయినా కడుక్కోకుండా నిస్త్రాణగా కుర్చీలో కూలబడింది. కాస్సేపటికి కాస్త ఓపిక తెచ్చుకొని వంటింట్లో ఉన్న సుభద్రకి వినపడేలా "వదినా ! కాఫీ" అని ఓ కేక పెట్టింది.

సుభద్ర కాఫీ, గ్లాసు తీసుకువచ్చి అందించింది. అన్నపూర్ణమ్మ "సుభద్రా ! నువ్వలా దాన్ని నెత్తి కెక్కించుకొంటే ఎల్లా చెప్పు ?" అని మందలించింది.

"ఆడబడుచూ అర్ధ మొగుడూ అన్నారు. వదిన అన్నయ్యకి చేసే సేవల్లో సగందాకా నేను కూడా చేయించుకోవచ్చు ! నేనింకా మంచిదాన్ని కనక తలకి నూనె రాయమతను. బాత్‌రూమ్‌లోకి వెళ్లి సుభద్రా తువ్వాలు అని అరవను, గుండీలు కుట్టమనను, ఇంకా. ." అంటూ ఆగింది చాలా సీరియస్‌గా మొహం పెట్టి.

"మీ అన్నయ్య నాకు రెండు నెలలకైనా ఓ చీరంటూ కొంటారు. మరి నువ్వు కనీసం

ఓ రవికల గుడ్డయినా కొనవ్" అంది సుభద్ర.

"నీ కొడుకుని రోజుకి రెండు గంటలైనా ఆడిస్తాను. నువ్వు, నీ శ్రీవారితో సినిమాలకి చెక్కేస్తే నేను వాడికి బేబీ సిట్టింగ్ చెయ్యడం లేదూ! వీటన్నింటికి నా ఛార్జెస్ నెలకు యాభై రూపాయలు. ప్రతీ నాలుగో నెలా నా కా యాభై యివ్వకుండా నువ్వు చీర కొనుక్కో."

వదినా, ఆడబడుచులు హాస్యాలాడుకొంటుంటే పోస్టువాడు ఉత్తరం పడేసి వెళ్ళాడు.

"నాన్నగారికి" అంది ఎడ్రస్ చూసి లక్ష్మి అన్నపూర్ణమ్మతో.

"చదువు పోస్టుకార్డే కదా" అంది అన్నపూర్ణమ్మ.

"శివరామయ్యగారికి,

మన స్నేహం బంధుత్వంగా మారితే బాగుంటుందని మీరు వ్రాసిన ఉత్తరం అందింది. మీ అమ్మాయి బియస్సి చివరి సంవత్సరం..."

"ఛీ నే చదవను" అంటూ లక్ష్మి ఆ ఉత్తరం వదిలేసి వెళ్ళిపోయింది.

"నువ్వు చదువమ్మా సుభద్రా"

"మీ అమ్మాయి బి. యస్సి చివరి సంవత్సరం చదువుతోందని, బావుంటుందని వ్రాశారు. అమ్మాయిని చూసుకోడానికి అబ్బాయితో కలిసి వీలు చూసుకొని వస్తాం. వచ్చేముందర ఉత్తరం వ్రాస్తాం. మీతో సంబంధం కలుపుకోవాలని ఎదురు చూస్తున్నాం."

ఇట్లు,
సుబ్బారావు.

తలుపు చాటునుంచి లక్ష్మి పాము చెవులు చేసుకొని వింటూ నిలబడింది. "పెళ్ళికొడుకు వివరాలేమిటి?" అని సుభద్ర కుతూహలంగా అడిగింది.

"అబ్బాయి హైదరాబాద్‌లో జూనియర్ ఇంజినీర్‌గా ఉన్నాడుట. పేరు రఘుట. పెద్ద ఉన్నవాళ్ళు కారు కాని మంచివాళ్ళట. మీ మావగారికి చిన్నప్పటి స్నేహితుడుట ఆయన. చిన్నప్పుడు ఏవోయి అంటే ఏవోయి అని పిలుచుకున్నా, ఇప్పుడు వయస్సు వచ్చాక మీరంటే మీరనుకుంటున్నారుట. వాళ్ళనెప్పుడో ఒకసారి రైల్లో చూసాము" అంటూ అన్నపూర్ణమ్మ వివరాలిచ్చింది.

లోపలినుంచి అంతా విన్న లక్ష్మి పంచరంగుల కలలకవడం మొదలుపెట్టింది. సింహం, సుభద్రల్లాగా తను, రఘు సినిమాకి గంట ముందరే వెళ్ళి క్యూలో నిలబడక్కర్లేదు. వ్యాను వెళ్ళి టికెట్లు కొని, సీట్లు రిజర్వ్‌చేసి తమకోసం నిరీక్షిస్తూ వుంటాడు. తను, ఆయన జీపులో సరిగ్గా సినిమా మొదలయ్యేసరికి హాలుకి జేరుకుంటారు. తను సుభద్రకంటే ఎక్కువ సినిమాలే చూస్తుంది.

పెళ్ళివారు ఒక నెలలోపలే లక్ష్మిని చూసుకోడానికి వచ్చారు. సుభద్ర చాలా శ్రద్ధ తీసుకుని లక్ష్మిని తయారుచేసింది. పెళ్ళివారికి ఫలహారాలు చేసింది. అటు సోఫా యిటు జరిపింది. గోడకున్న ఫోటోలకు బూజు దులిపింది. కుర్చీలలో దిళ్ళకి కొత్త గలీబులు తొడిగింది. టీపాయ్‌మీద గుడ్డ వేసింది. సుభద్ర హడావిడి చూసి,

"ఏమిటమ్మా! పెళ్ళివారు చేసుకోదల్చుకొంటే యివన్నీ పట్టించుకొంటారా? చేసుకోదల్చుకోకపోతే వీటిని చూసి మనస్సు మార్చుకొంటారా? నీ చాదస్తంగాని" అంది అన్నపూర్ణమ్మ ఆప్యాయంగా.

అసలు సుభద్ర భయం యీ ఇంటి కోడలిని అనుకొంటారేమోనని. "మీరలాగే అంటారు. కాని లక్ష్మి! వచ్చే రాజకుమారుడు లక్ష్మికి నచ్చాడనుకొందాం. కాని ఈ పెంకెపిల్ల అతనికి నచ్చకపోతే, మా వదిన సరియైన ఏర్పాట్లు చెయ్యలేదు. నేను అతనికి సరిగా కనపడివుండను. మధ్యలో టేబుల్ అడ్డంవుంది కూడాను అనుకొని ఆపైన నన్ను ఆడిస్తుంది" అంది సుభద్ర, పెళ్ళిచూపుల గదికి చివరి మెరుగులు దిద్దుతూ.

రైలు స్టేషన్‌కి వెళ్ళిన శివరామయ్య, నరసింగరావ్‌లు పెళ్ళివారిని తీసుకొని టాక్సీలో వచ్చారు. సుభద్ర చిడీమీద బక్కెట్టు నీళ్ళు పెట్టింది. అందరు కాళ్ళు కడుక్కొని లోపలికి వచ్చారు.

"అన్నపూర్ణ మీకు తెలుసుకదా! పోతే ఆ పిల్ల మా కోడలు" అంటూ శివరామయ్య పరిచయం చేసాడు.

కాఫీలు టిఫిన్లూ అయి పెళ్ళికూతుర్ని తీసుకు వచ్చే లోపల పెళ్ళివారు గోడల్నీ, కుర్చీల్ని అక్కడున్న ప్రతి వస్తువుని పరిశీలిస్తూ కూర్చున్నారు.

**దీపావళి పోటీలో రు. 800 లు బహుమతి పొందిన కథ!**

"చూసారా అత్తగారు?" అంది అన్నపూర్ణమ్మ చెవిలో సుభద్ర.

"అమ్మాయిని తీసుకురా అమ్మా సుభద్రా!" అని శివరామయ్య అనగానే సుభద్ర లోపలికి వెళ్ళి లక్ష్మిని తీసుకువచ్చింది.

లక్ష్మి సిగ్గుపడుతూనే చూసింది. అబ్బాయి పొడుగ్గా చామనచాయగా బాగున్నాడు అనుకుంది. లక్ష్మి అతన్ని చూసే సమయంలోనే అతను లక్ష్మిని చూసాడు. రఘు కళ్ళు చిలిపిగా నవ్వాయి. లక్ష్మి కంగారుపడి తలదించుకొంది.

"నీ పేరేమిటమ్మా?" రఘు తల్లి అడిగింది.

"లక్ష్మి."

"ఏం చదువుతున్నావ్?" సుబ్బారావు ప్రశ్నించాడు.

"బియస్సి ఫైనలియర్."

"పెళ్ళయ్యాక చదువు మానేస్తారా? పూర్తి చేస్తారా?" రఘు నెమ్మదిగా అడిగాడు. అడగటానికి చాలా మొహమాట పడ్డాడు. తన తల్లిదండ్రుల ఎదుట, లక్ష్మి తల్లిదండ్రుల ఎదుట, లక్ష్మితో మాట్లాడటానికి సిగ్గుగా వుంది. ఈ పెళ్ళిచూపులు పెళ్ళికొడుక్కి ప్రాణాంతకం. పెళ్ళికూతుర్తో మాట్లాడాలని చాలా కోర్కెగా వున్నా మాట్లాడాలంటే అంతమందిలో గొంతుక పట్టేస్తుంది.

"నీయిష్టం బాబు. చదివించమంటే చదివిస్తాం వద్దంటే మానేస్తాం" అన్నాడు శివరామయ్య.

"నేను చదివించమంటే, మీరు చదివిస్తే ఆవిడ చదువుతుందా? తనమటుక్కి తనకి చదవాలనో వద్దనో వుండదా?" అని అడిగాడు రఘు కాస్త ధైర్యంచేసి.

"అదేం ప్రశ్నరా రఘూ! మన దేశంలో ఆడపిల్లల చదువు లంతేకదా!" అని సుబ్బారావు మందలించాడు.

"నాకు బియస్సి పూర్తిచెయ్యాలని వుంది" అంది హఠాత్తుగా లక్ష్మి. ఆ అవకాశం పోతే రాదేమోనన్న భయంతో.

"బియస్సి పూర్తిచేసి ఆపైన పెళ్ళిచేసుకొంటారా? లేక పెళ్ళయ్యాక పూర్తిచేస్తారా?"

"పెళ్ళయ్యాకే పూర్తిచేస్తుంది. చదువు పూర్తయ్యేలోపల నువ్వు వస్తూపోతూవుంటే..." శివరామయ్య జవాబిచ్చాడు లక్ష్మికి అవకాశం యివ్వకుండా.

"పరీక్ష తప్పడానికా?" రఘు నవ్వుతూ అడిగాడు.

"పరీక్షలింకా ఎనిమిదినెల లున్నాయి. పెళ్ళికో వారం, దీపావళికో మూడ్రోజులు సంక్రాంతికో మూడ్రోజులు పోయినా చదువు అంతగా పాడవుతుంది అనుకోను" అన్నాడు శివరామయ్య పెళ్ళెక్కడ వాయిదా పడుతుందోనన్న కంగారుతో, ఆడపిల్లల తండ్రులకుండే సహజమైన ఆత్రంతో.

రఘు లక్ష్మికేసి చూసాడు. లక్ష్మి సిగ్గుపడుతూ తల వంచుకొంది, నా అభిప్రాయం అదేనని సూచిస్తూ.

"అమ్మాయి నచ్చిందీ లేందీ వెళ్ళగానే ఉత్తరం రాస్తారుకదా!" శివరామయ్య మాటలో అభ్యర్థన గ్రహించి,

"నచ్చాల్సింది మావాడికి. వాడి మొహం చూస్తుంటే మీకేమనిపిస్తోంది?"

లక్ష్మి సిగ్గుపడుతుంటే సుభద్ర లోపలికి తీసుకువెళ్ళింది.

"మీ వీలుచూసుకొనొచ్చి తాంబూలాలు పుచ్చుకోండి" అన్నాడు సుబ్బారావు. అన్నపూర్ణమ్మకంతా వింతగా వుంది. అందరు కతికితే అతకదని ఆడపెళ్ళివారు ఏం పెట్టినా తినరు. వీళ్ళు శుభ్రంగా అన్నీ తిన్నారు. అభిప్రాయంకూడా అక్కడికి అక్కడే చెప్పేస్తున్నారు!

"మా కొక్కగానొక్క ఆడపిల్ల. పెళ్ళి ఘనంగా చేస్తాం. లాంఛనాల విషయంలోకూడా లోటు చెయ్యం. కట్నం..."

"నేను కట్నం తీసుకోను. మా నాన్నగారు, నేను తీసుకొందామన్నా, తీసుకోనీరు" అన్నాడు రఘు గట్టిగా, లోపలున్న లక్ష్మికి వినిపించి తన్ని మనసులో మెచ్చుకోవాలని. శివరామయ్య సంతోషానికి అవధుల్లేకపోయాయి.

"కాని మరో విషయం. నేను నా కొడుక్కి కట్నం పుచ్చుకోకపోవడమే కాదు. నా కోడలికి బంగారంకూడా పెట్టను. మీ అమ్మాయికి పెళ్ళిలో మేము ఏమీ పెట్టకపోవడం మీకు చిన్నతనం అనుకొంటే, మీకు తోచిన ఆభరణాలు మీరే పెట్టండి" అన్నాడు సుబ్బారావు.

"అల్లాగే కానివ్వండి" అన్నాడు శివరామయ్య.

[ఇంకా వుంది]

# ఎన్నో హెయిర్ డైలు, జుట్టును పైపైనే డై చేస్తాయి కనుక, త్వరగా వెలిసిపోతాయి... కానీ

# ట్రూ-టోన్

## మాత్రమే, ప్రతి వెంట్రుకలోకీ చొచ్చుకొనిపోయి, జుట్టును శాశ్వతంగా డై చేయడమే కాక...జుట్టుకు సహజమైన ఆ రూపాన్ని యిస్తుంది.

ట్రూ-టోన్...దానిలోని ప్రత్యేకమైన సూత్రీకరణ వలన, వెంట్రుకలోని క్యూటికిల్‌ను ఛేదించి కార్టెక్స్‌లోకంటా చొచ్చుకొని పోతుంది. ఫలితంగా, ఈ డైను జుట్టు త్వరగా గ్రహించుకుంటుంది... మరోమాటలో చెప్పాలంటే ఈ డై, జుట్టు యొక్క రూపాన్ని శాశ్వతంగా సహజంగా ఉండేలా తీర్చిదిద్దుతుంది.

ట్రూ-టోన్, జుట్టుకు సంబంధించిన రసాయన శాస్త్రం బాగా తెలిసిన హెలిన్ కర్టిస్ వారు సృష్టించినది.






లిక్విడ్



జెల్

**వీటిలో దేన్నయినా ఎన్నుకోండి:**
**ట్రూ-టోన్ లిక్విడ్ హెయిర్ డై మరియు బొట్లుగా కారని ట్రూ-టోన్ జెల్.**

ఈ రెండు మీ జుట్టును మృదువుగా, నిగనిగలాడేలా కావలసిన తీరులో లొంగేలా తీర్చిదిద్దగలిగే హెయిర్ కండిషనర్‌తో కూడినవి.

మీ జుట్టును మొదటి సారిగా డై చేద్దామనుకుంటున్నారా?
ఉచితంగా లభ్యమయే ఒక చిన్న పుస్తకం,
"హెయిర్ డైయింగ్ ఎక్స్‌ప్లెయిన్డ్", కోసం
ఈ చిరునామాకు వ్రాయండి:
జె.కె. హెలిన్ కర్టిస్ లిమిటెడ్, జె.కె. బిల్డింగ్, బొంబాయి-400 038

నలుపు మరియు గోధుమ రంగులలో లభ్యమవుతుంది. మగవారి కోసం ప్రత్యేకమైన ప్యాక్.

everest/269/JKH-tl

---

మీ కావలసిన సరకులకోసం— స్పారీ & కంపెనీ లిమిటెడ్, మద్రాసు, జి ఎథర్టన్ & కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, కలకత్తా, జె కె హెలెన్ కర్టిస్ లిమిటెడ్ బొంబాయి ... డివిజన్‌కు వ్రాయండి.

## శ్రావణ సంధ్య

(23 వ పేజీ తరువాయి)

బ్రతకలేదు. ఎట్లా తెలిసింది ? ఎవరు చెప్పారు ? రాజారాం ఏమైనా వచ్చివెళ్లాడా ?

నీలిమ భయంగా చూస్తూ నిలబడింది. మమ్మీపై డాడీకి అంత కోపం ఎందుకొచ్చిందో ఆ పిల్లకు బోధ పడలేదు.

దూరంగా గోడ పక్కన పడివున్న ఆ కర్రను నెమ్మదిగా తెచ్చి, భర్త కిచ్చింది శాంతి ఆయన ఎదురుగ్గా కూర్చుంది కళ్లు మూసుకొని, మనస్సును రాయి చేసుకొని, దుఃఖోద్వేగాన్ని దిగమింగుకొని.

"ఇందాక దెబ్బ తప్పిపోయింది. ఇప్పుడు అందుబాటులో ఉన్నాను. మీ వొంట్లోని సత్తువకొద్దీ నా తలమీద కొట్టండి మీ చేతుల్లో చావడంకంటె నా బ్రతుక్కు సార్థకమేముంది ?"

పిచ్చి ఆవేశంతో వొణికిపోతున్నాడు రాంమ్మోహన్

"ఊఁ !.. కానివ్వండీ నన్ను కొట్టి మీ కోపాన్ని చల్లార్చుకోండి " అంది శాంతి నిబ్బరంగా

"నేను విన్నది నిజమేనా ?" రాంమ్మోహన్ కంఠం ఖంగుమన్నది.

"ఏమని ?"

"నువ్వూ రఘునాథ్ కలిసి హోటళ్లలో, గెస్టు హౌసుల్లో విచ్చలవిడిగా తిరుగుతున్నారట..."

"ఎవరు చెప్పారు ?"

"ఎవరు చెబితే యేం ? అది నిజమేనా ?"

"నిజానిజాలు చెప్పే వ్యక్తినిబట్టి వుంటాయి. ఎవరు చెప్పారో చెప్పండి."

"రాజారాం"

"ఎందుకు చెప్పాడు ?"

"ఏమో ?"

"అతగాడు చెప్పిందంతా మీరు నమ్మారన్నమాట" చిరునవ్వు నవ్వుతూ లేచింది శాంతి.

చెంప ఛెళ్లుమనిపించినట్లయింది రాంమ్మోహన్‌కు.

"ఎవరో ఏవో దురుద్దేశాలతో ఏమేమో చెబితే, వాటి నన్నింటినీ నమ్మే బలహీనులన్నమాట మీరు నామీద రాజారాం దుష్ప్రచారం ఎందుకు చేస్తున్నాడో మీరు గ్రహించారా ? లేదు. అతనికి కావాల్సింది నామీద పగదీర్చుకోవడం."

"దేనికి ?"

"దేనికంటే — అతన్ని నేను పెళ్లి చేసుకోలేదని. ప్రేమించి మిమ్మల్ని పెళ్లి చేసుకున్నానని. మన బ్రతుకులో విషాదాన్ని చూడడం అతనికి సరదా, సంతోషమూ. అతను మన ఇంటిచుట్టూ తిరిగేది మన శ్రేయస్సును కోరికాదు; మన సంసారం చితికి, చెల్లాచెదరైతే ప్రత్యక్షంగా చూసి సంతృప్తిపడటానికి. మనుషులు విషాన్ని మొహానికి పులుముకు తిరుగుతూంటే, అది ఫేస్ పౌడరని భావించి, భ్రమించి — మనబోటివాళ్లం మోసపోతున్నాం. మనస్సుల్ని మురికి చేసుకుంటున్నాం."

"అంతేనంటావా ?"

"అంతగాక మరేముంది ? — అన్నట్టు నా ఉద్యోగానికి ఇవాళతో స్వస్తి రిజైన్ చేశాను."

"ఎందుకని ?"

నవ్వింది శాంతి ఆ నవ్వు అర్థమేమిటో రాంమ్మోహన్‌కు బోధపడలేదు అదంత తేలికైన విషయమా ?

"తర్వాత చెబుతానులెండి ! మన భవిష్యత్తూ, దాన్ని గురించి బంగారు పథకాలూ...! ముందు కాఫీ తాగుదాం. నీలూ, నీకూ బోర్న్‌విటా యిస్తానమ్మా ! డాడీతో కబుర్లు చెబుతూవుండు" అంటూ వంటగదిలోకి వెళ్లింది శాంతి తెగింపుతోకూడిన ఉత్సాహంతో

అయిదు నిముషాల్లో రెండు కప్పుల కాఫీ, ఒక కప్పు బోర్న్‌విటా తయారుచేసి తీసుకువచ్చింది శాంతి. అంతకు వారం రోజుల క్రితం ఇంట్లో ఎలుకల్ని చంపడానికి తెచ్చిన "జింక్‌ఫాస్ఫేట్" మందును కాఫీ కప్పుల్లోనూ, బోర్న్‌విటా కప్పులోనూ కలిపింది భర్తకూ, నీలిమకూ కప్పులు అందించి, తానూ తీసుకుంది. భర్త పక్కనే కూర్చుంది

నీలిమ గడగడా బోర్న్‌విటా తాగేసింది. "ఛీ. బావుండలా !" అంది. నీలూను గబుక్కున వొళ్లోకి లాక్కుంది శాంతి.

"ఏమిటి కాఫీ ఇలా వుంది" అన్నాడు రాంమ్మోహన్ తాగిన కప్పును కిందకు జారవిడిచి.

"పాలు బావుండలేదేమో !" అంటూ శాంతి తన కప్పులో కాఫీని త్రాగేసింది.

రాంమ్మోహన్ సిగిరెట్టు తీసి నోట్లో పెట్టుకోబోయాడు. కాని అంతలోనే ఏదో కడుపులో వికారంగా వుండి, దిండుమీద తల ఆన్చాడు. అప్పటికే తల్లి వొడిలో నీలిమ కన్ను మూసింది

రాంమ్మోహన్ ఎదుర్రొమ్ముమీద శాంతి తల ఆన్చింది కడుపులో వికారంగా వుంది కళ్లు అదో రకంగా కదులుతున్నాయి. ఎదురుగ్గా గోడమీద పెళ్లినాటి ఫోటో వుంది. దానికేసి చూస్తో, ఆలోచించటానికి ప్రయత్నిస్తోంది .

వచ్చే జన్మలో ..కూడా...తనకు రాంమ్మోహన్ . భర్తగా . లభించాలి . నీలూకు .. తాను తల్లి ... కావాలి . .

అదుగో ! ... తమ పెళ్లి .. వైభవంగా ... జరుగుతోంది తన తల్లిదండ్రులు.. రామ్ తల్లిదండ్రులు . . ఎంతోమంది పెళ్లి పెద్దల మధ్య ... మంగళ వాయిద్యాలు ... మోగుతున్నాయి .. తనవైపు రామ్ ప్రేమగా చూస్తూ...తన మెడలో... మంగళసూత్రం . కడుతున్నాడు .. పెళ్లి పెద్దలందరూ ... చక్కని సంసార జీవితాన్ని .. ఆశీర్వదీస్తూ .. శుభాకాంక్షలతో...అక్షింతలు ... వేస్తున్నారు ...

నిత్యకళ్యాణం — పచ్చతోరణంలా ... పచ్చపచ్చగా .. కళకళలాడుతోన్న ... తన సంసారం ... సంవత్సరంన్నర తర్వాత . ఉయ్యాల్లో ... నీలూ !

కళ్లల్లో వూపిరి వున్నంతవరకూ, ఆ పెళ్లినాటి ఫొటోకేసి చూస్తూ, గుండెలో దీపం ఆరిపోబోయే వరకూ — రాబోవు జన్మ గురించి ఆలోచిస్తూనే, కలలుకంటూనే, ఊహిస్తూనే వుంది శాంతి.

నిర్జీవంగా పడివున్న భర్త శరీరంమీదనే తన తనువును కూడా వొదిలింది శాంతి — వొళ్లో నీలూ అంతకుముందే కళ్లుమూయగా

శాంతి లేదు.

రాంమ్మోహన్ లేదు.

నీలిమ లేదు

ఆ ఇంట్లో ఆ పెళ్లి ఫొటో మాత్రమే గోడకు వ్రేలాడుతూ వుంది ఆ ట్రాజడీకి సాక్ష్యంగా - శ్రావణసంధ్య చీకట్లు ముదురుతూండగా.

( అయిపోయింది )

## అడగాలని ఉంది నాకు...

కనమలూరు వేంకట శివయ్య

అడగాలని ఉంది నాకు
అరవిచ్చిన సురపొన్నను
విరబూచిన విరజాజిని
సరసీరుహ సీమంతిని
చిరునవ్వుల చేమంతిని

జల ధరముల చన్నీటిని
వలిమలపై పన్నీటిని
జల జల జల సెలఏటిని
గల గల గల ధునిసీటిని

సరిగాదుల నాదమ్ముల
హరి చాపపు వర్ణమ్ముల
శరధిరమ్య తరగమ్ముల
కరదీపిక కిరణమ్ముల

అడగాలని ఉంది నాకు
"మీలో మీ పావనజాతిలో
కలహమ్ములు లేవెందుకు
కలగలపుల తలపెందుకు
కలగుండులు లేవెందుకు
పులి గుండెలు లేవెందుకు
మీర్జేసిన పుణ్యమేమి
మీ పాలిటి దైవమేమి ?"

శ్రీ గౌతమ్ పిక్చర్స్ వారి

# ఈ కాలం దంపతులు

(శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి
అపశ్రుతులు నవల ఆధారంగా)

నిర్మాత. యస్. రామబ్రహ్మం

దర్శకుడు: డి. యోగానంద్

నైజాం: యస్.యస్. ఏపి. సీడెడ్: విజయా

(గౌతమి పిక్చర్స్
విడుదల)



# రాదారి పడవ

(18 వ పేజీ తరువాయి)

చేసేదేమీ లేక నోరు మూసుకున్నాడు. శ్రీనివాస్ చాలా బాధపడ్డాడు. ప్రసూనకు అది విని నవ్వాలో, ఏడవాలో తెలియలేదు చాలమంది అతణ్ని పిచ్చివాడి కింద జమ కట్టారు పత్రికలన్నీ వింతల్లో ప్రకటించాయీ వార్తను. అన్నిటికి ఒకేలా కనిపించాడు సుబ్బారావు.

పది, పదిహేను రోజులు గడిచాయి. అమెరికా నుండి ఒక స్నేహితుడు పంపగా, ఆరోజే వచ్చిన పెళ్లి (గీటింగ్స్) కార్డు చూస్తూ కూర్చున్నాడు సుబ్బారావు. గుమ్మం దగ్గిర అలికిడి వినిపించటంతో లేచి చూశాడు. ఒక పదిహేడు, పద్దెందేళ్లమ్మాయి నిలుచుంది.

"సుబ్బారావుగారిల్లిదేనా ?" అంది, సుబ్బారావును చూస్తూ.

"అవును. లోపలికి రా అమ్మాయ్" అంటూ ఆహ్వానించాడా అమ్మాయిని.

"సుబ్బారావుగారంటే..." అంది లోపలికి నడుస్తూ.

"నేనే"

"నమస్కారమండీ. నా పేరు వసుధ" అంది.

ఆ అమ్మాయి నెక్కడా చూసినట్టు గుర్తులేదు అతడికి అయినా ఆమెను కూర్చోమని తనూ కూచున్నాడు.

"ఎలా ప్రారంభించాలో తెలియట్లేదండీ" అందా అమ్మాయి ప్రారంభిస్తూ.

'తెలివైనదే' అనుకున్నాడు, సుబ్బారావు నవ్వుకుంటూ.

"ఫర్వాలేదు" అన్నాడు, చెప్పమన్నట్లుగా చూస్తూ.

"మీరు చేసినపని పేపర్లో చదివానండీ. నిజంగా నమ్మలేకపోతున్నాను" అందామ్మాయి

ఏం మాట్లాడాలో తెలియలేదు సుబ్బారావుకు.

"మీరింత గొప్పవారు కావడానికి కారణం దుర్మార్గులైన తల్లిదండ్రులు. ఏమంటారు" చొరవగా అంది అంతలోనే.

"దుర్మార్గులు కాదు. మూఢాచారాలు వదల్లేనివాళ్లు, పెళ్లి విషయంలో పిల్లలకు స్వేచ్ఛ నివ్వని వాళ్లు. ఇక గొప్పదనమంటె అది ఆపాదిస్తున్నది నువ్వే."

"అది పోనీలెండి. కాని మీరన్నట్టు ఈ వెధవ ఆచారాలు, విశ్వాసాలు మనుష్యుల్ను ఎంత పాడు చేస్తాయో చెప్పలేం. పురాణాలు చదువుకుని, కొట్టినా తిట్టినా భర్తనే ఆశ్రయించే భార్యలను, రామాయణాలను చదువుకుని బలవంతంగా శీలం కోల్పోయినా, ప్రాణాలు తీసుకునే అమ్మాయిలనూ చూస్తుంటే నాకు మనసు కొట్టుకుంటుందండీ, అందుకే ఇవన్నీ వొట్టి చెత్త అంటాను నేను. ఏమంటారు?"

"ఓ ఆడపిల్లలా, అందునా హిందూ మతంలో పుట్టి యిలా మాట్లాడుతుండం టే ఆశ్చర్యం వేసినా, సంతోషం కలుగుతూంది"

"నిజంగా మీలాంటి తలిదండ్రులుంటే ఈ పిల్లలెంత బాగుపడేవారండీ."

"మళ్లీ ఎక్కడికో వెడుతున్నావమ్మాయ్ నువ్వు"

"అఫ్‌కోర్స్. అది నిజమేననుకోండి. కానీ అబద్ధమంటారా నా మాట?"

సుబ్బారావు మాట్లాడ్లేదు.

"అన్నారు మీరు. మీరు సంఘ శ్రేయస్సు కోసం ఏవైనా సంస్కరణలు ఆరంభించ కూడదా?"

"అది నా ఒక్కడివల్లకాదు. ఐనా చేయాలనే వుంది నాకు."

"అలా పెద్దల పెంపకాలమీద, మూఢాచారాలమీద చర్చించింది చాలాసేపు. చివరికి అంది—

"మీలో ఒక ముఖ్యమైన పనుండి వచ్చాను" అంటూ ఆగింది.

"చెప్పమ్మాయ్"

"మీరేమీ అనుకోకుంటే" అంటూ, "ఈ ఉత్తరం చదవండి" గబుక్కున అంది, ఓ కవర్ యిస్తూ.

సుబ్బారావు తీసుకున్నాడు. తల వంచుకుని, చేతి గోళ్లను పరీక్షిస్తుందా అమ్మాయి.

అందులోని ఉత్తరం తీశాడు.

"సుబ్బారావుగారికి :

నేను స్వార్థపరురాలిని, హృదయం లేని దాన్ని అనుకోకుండా చదవండి దయచేసి.

మా కాలేజ్‌లో ఒకబ్బాయిని నేను ప్రేమించాను. పెళ్లి చేసుకోవాలనుకున్నాను. మాకు ఒకరిమీద మరొకరికి నమ్మకముంది. ఎంత నమ్మకమంటే, పెళ్లి కాకుండానే నన్ను నేను అతనికి అర్పించుకున్నాను.

ఐతే మా నాన్నగారికి డబ్బులేని విక్టర్‌ని అల్లుడిగా చేసుకోవటం యిష్టంలేదు. పైగా వాళ్ళ మతం వేరు కనుకససేమిరా వీల్లేదట. మమతల మధ్య మతాలేమిటి చెప్పండి? ఆచారాల పేరిట కలిసిన మనసులను విడి పొమ్మంటే ముడివేసి తీసినంత సులభమా చెప్పండి?

నేను గర్భవతినన్న విషయం తెలియగానె నాకు పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారు నాన్నగారు. విక్టర్‌ని పెళ్లి చేసుకోవటానికి నాకు ధైర్యం లేదని కాదు నాకు మైనారిటీ తీరటానికింకా ఏడు నెలలుంది. ఆ లోపున విక్టర్‌తో నేను వెళ్లిపోతే, నా విక్టర్‌ని కిడ్నాపింగ్ కేసు పెట్టి, జెయిల్లో వేస్తారు.

విక్టర్‌ని పెళ్లి చేసుకోలేకపోతే నాకు చచ్చిపోవటం కంటే మార్గాంతరంలేదు. మీలాంటి చదువుకున్న, వుద్యోగం చేస్తున్న వారికి, అందునా పేరున్న రచయితకి-ఎంతో డబ్బు లేకున్నా తన కూతురిని యివ్వటానికి మా నాన్నగారి కభ్యంతరం వుండదనుకుంటూను. మీకు తెలిసిందనుకుంటూను.

ఏడునెలలు నాకు రక్షణ కావాలి. అది మా నాన్నగారు ఒప్పుకోవటం కోసం పెళ్లి పేరుతో. నేను మీకేమీ భారంగా వుండను.

మీకు యింతకన్నా ఏమీ చెప్పలేను.

దయచేసి నన్ను స్వార్థపరురాలినని, మనసులేనిదాన్నని అనుకోకండి. ఈవయసులో కోరికలతో ఏ ఆడపిల్లైనా తలిదండ్రులు కూడదంటే ఆత్మహత్య చేసుకోవటం తప్ప మరేం చేయగలదు చెప్పండి?

మీ మనసు నొప్పిస్తే నన్ను క్షమించండి.

వసుధ''

ఉత్తరం మడిచి వసుధవైపు చూశాడు. ఆ అమ్మాయి దీనాతిదీనంగా చూస్తూంది. అప్పటికే కరిగిన సుబ్బారావు హృదయం ఆ చూపులకు చలించి పోయింది. లేచి నిలుచున్నాడు. ఆ అమ్మాయి లేవబోతుంటే, సున్నితంగా కూచోబెట్టి, ఆప్యాయంగా భుజం తట్టాడు.

ఒక క్షణం ఏదో ఆలోచిస్తూ, బయటికి దృష్టి సారించిన సుబ్బారావుకు కృష్ణ ఒడ్డున ఆవలి తీరం చేరటం కోసం కాచుకున్న ప్రయాణీకులు కనిపించారు. దూరంగా వస్తూన్న రాదారిపడవ వైపు దీక్షగా చూస్తూ నిలుచున్నాడు....

[అయిపోయింది]




''చూడు నాయనా! యిక్కడ యీబల్ల దగ్గర ఎవరోగాని! నాకు కాఫీ యిచ్చావు గని ఇందులో పంచదార తక్కువ యింది. కాస్త పట్టుకొస్తావా''—హోటల్లో మారుమూల బల్లమీద కూర్చుని ''హోటేలు ప్యాసింజర్'' కేక. ఒకటోసారి, రెండోసారి, మూడోసారి— కేక ''వాల్యూమ్''లో తేడా వుందికాని, వాక్య నిర్మాణంలో వ్యత్యాసం వుందేమోకాని,— ఆ సామాన్య కాఫీగతప్రాణి గోల కొకటే అర్థం. కాని ఫలితం శూన్యం. సర్వేశ్వరుడు అనగా సర్వర్ సుందరుడు— ఒకానొక 'నవల' చదువుకుంటున్నాడు-కనుక అతడు పఠిస్తున్న సన్నివేశం మంచి పట్టులో వున్నది. కావున- అదీ సంగతి...

కాలేజీలో తెలుగు మాష్టారు అమ్మాయిల బెంచీలకేసిచూసి ''అమ్మా! నువ్వు చెప్పు... అంతట దుష్యంతునితో శకుంతలఏమనెను?'' రెండోసారి కేకకి ఉలిక్కిపడ్డ చకోరాక్షి నిలబడి ''ఏమోనండి! నేను వినలేదు'' అంది —''ఏది వినలేదు?— శకుంతల దుష్యంతునితో అనిన మాటలా? నేను చెప్పుచున్న పాఠమా? ఏది?'' అన్న లెక్చరర్‌గారి ప్రశ్నకు ఏది నవలో అదే జవాబు. ఆ అమ్మాయి ప్రక్కనున్న మరా అందాల బొమ్మ కూడా డెస్క్‌లో తెరచి పెట్టుకుని రహస్యముగా చూచుచున్నది ఏమి? ఒకానొక తెనుగు నవల పడుతున్న పత్రికలోని రసవత్తర పఠనీయ సన్నివేశము—

ఆఫీసులో టిఫిన్ తింటున్న అధికారి మిరపకాయపంటికింద కొరికి వేసిన గావుకేకకి వెలుపలగల ''బాలుని'' సమాధానం రావటానికి ఐదు నిమిషాల పదహారు సెకన్‌లు పట్టింది!— ''మంచినీళ్లరోయ్'' అన్న కేకకి ''చన్నీళ్లు'' తేడానికి ఆ బాయ్‌కి మరో అన్ని నిమిషాలు పట్టింది. కారణము అతడు ముంగాళ్లమధ్య పెట్టుకుని చదువుతున్న దో నవలారాజము—

ఇట్లా ఇంట్లో, రైల్లో, బళ్లో, గుళ్లో, మార్కెట్‌లో, సూపర్ మార్కెట్‌లో, పిల్లకాయల ఒళ్లో, యిందుగలదందు చదువబడదు అన్న సందేహం అక్కరలేని పదార్థం నవల— దీని కీ యేడాది డిమాండ్ పెరిగింది. ఆడనవలలు, మగనవలలు, మగాడ— ఆడమగ నవలలెన్నో వెలువడినవి. లెక్కకు మించినన్ని లైబ్రరీలలో, అద్దెకు కాలక్షేప సాహిత్యము మొదలు గుప్త సాహిత్యమువరకు దొరకు నీధి పుస్తక భాండాగారాల్లో దొరుకుచున్నవే...?! కాని సాహిత్య అకాడమీవారికి ఒక నవల ఓ వెయ్యి రూపాయిల అవార్డు పారేయటానికి ఏల దొరకలేదు?! ఎట్లు దొరకలేదు...?! ''ఇది నవలా సంవత్సరమే! ఇది మహిళా సంవత్సరమే...! అలాస్? ఎలాస్ టు ఏ ల్యాస్ హూ రైట్స్ ప్లెజంట్ స్టయిల్ యిన్ ఏ సీరియల్...

[వీరాజీ]





# రేపు గుబ్బారం

యర్రంశెట్టి సాయి

రమణారావ్ కళ్ళు తెరిచాడు. చుట్టూ తెల్లని గోడలూ-నిశ్శబ్దంగా, నెమ్మదిగా తిరుగుతోన్న సీలింగు ఫానూ-దూరంగా వినబడుతోన్న మూలుగూ-

ఇంతకూ తనెక్కడున్నాడు? పక్కమీద నుంచీ ఒక్క ఉదుటున లేవబోయాడతను.

"ప్లీజ్! లేవకండి!" మృదువుగా బుజాలు పట్టుకొని అడ్డగిస్తూ అంది నర్స్.

రమణారావ్ తెల్లబోయాడు. ఏమిటి ? తను హాస్పిటల్లో ఉన్నాడా? ఎందుకు? పడుకోకుండానే ఓ చేతిమీద ఆనుకొని తననితనే పరీక్షగా చూసుకున్నాడు. కొంచెం కదలగానే కుడికాలిలో నొప్పి విద్యుత్‌లా వొళ్ళంతా అల్లుకుపోయింది.

"అబ్బా!..." బాధగ వెనక్కి వాలిపోయాడతను. కుడికాలికి తొడదగ్గర్నుంచీ, పాదంవరకు తెల్లగా బాండేజ్ కనిపించింది.

చటుక్కున అతనికి గుర్తొచ్చింది.

అవును! జీప్ ప్రమాదం! డ్రైవర్ ముత్యాలు హటాత్తుగా జీప్‌కి అడ్డం వచ్చిన ఓ కుర్రాడిని రక్షించడానికి, జీప్‌ని హటాత్తుగా పక్కకు తిప్పడం— అటువేపు నుంచి వేగంగా వస్తోన్న లారీని ఢీకొనడం— అంతే! అంతవరకే తనకు గుర్తుంది. అంటే తనకూ గాయాలు తగిలాయన్నమాట! ఈకాలు ఒక్కదానికేనా? ఇంకెక్కడన్నా తగిలాయా? చేతులో తల తడుముకొన్నాడు రమణారావ్. తలకుకూడా మెత్తగా బాండేజ్ తగిలింది.

అంటే— జరిగింది చాలా పెద్ద ప్రమాదమే! మరి ఈ విషయం తన భార్యా బిడ్డలకు తెల్సిందా?

నెమ్మదిగా తల పక్కకు తిప్పి చూశాడు రమణారావ్. ఆగదిలో మరొక్క బెడ్ మాత్రమే ఉంది. బహుశా స్పెషల్‌రూమ్ అయుండాలి ఆబెడ్‌మీద మరో మనిషి అతని కాళ్ళకూ చేతులకూ, తలకూ కూడా కట్లున్నాయి. హటాత్తుగా తల పగిలిపోతున్నట్లు నొప్పిపుట్టసాగింది.

"అబ్బా !..." బాధగా మూలిగాడతను

నర్స్‌వచ్చి అతనికో ఇంజక్షన్ ఇచ్చింది.

"సిస్టర్ !" నెమ్మదిగా పిలిచాడు.

"యస్ ..."

"నేనిక్కడ — ఇలా ఉన్న విషయం మావాళ్ళ కెవరికైనా తెలిసిందా ?"

"తెలిసేవుంటుం దీపాటికి. మీకంపెనీ మేనేజరు గారెవరో వచ్చివెళ్ళారిందాక ! ఆయన మీఇంటికి కబురుచేయాలని ఎవరితోనో అంటూంటే విన్నాను..."

"బహుశా మేనేజర్ శ్రీమంత్ వచ్చి వుంటాడు" అనుకున్నాడు రమణారావ్.

మరి జీప్‌డ్రైవర్ ముత్యాలు ఎలా వున్నాడో ? తనకు తగిలిన గాయాలు ఎలాంటివో ? ప్రమాదకరమైనవి కాదుగదా? తన ప్రాణానికేం అపాయం లేదుకదా —

"సిస్టర్..."

"చెప్పండి..." పక్కనున్న పేషెంట్‌కి కూడా ఇంజక్షనిస్తూ రమణారావ్ వేపు చూసిందామె.

"నాకు తగిలిన గాయాలు బాగా ప్రమాదకరమైనవా ?"

చిన్నగా నవ్విందామె.

"మీరు చాలా అదృష్టవంతులు ! కాలికి మాత్రమే రెండు మూడు ఫ్రాక్చర్స్ అయినయ్..."

"మైగాడ్ ..." భయంగా అనుకున్నాడతను. మరి తనిక నడవగలడా ? లేక జీవితాంతం కుంటుతూ వుండాల్సిందేనా ?

ఈవార్తవిని ఇంటిదగ్గర అందరూ ఎంత ఖంగారుపడిపోతారో! పెద్దాడు, పెద్దకోడలు తనంటే ఎంత ప్రేమగా ఉంటారో తనకు తెలుసు. పరాయింటి పిల్లయినా తనను — స్వంత తండ్రిలా చూసుకుంటుందామె.

చిన్న కొడుకు — చిన్న కోడలు సరేసరి — తననడగందే ఏపనీ చెయ్యరు. ఆపిల్ల తమ ఇంటికొచ్చి సంవత్సరం కూడా అవలేదు. కానీ పదేళ్ళ నుంచీ ఉన్నట్లుగా తమలో కలిసిపోయింది.

తన భార్య రాజ్యం కళ్ళముందు కనిపించింది రమణారావ్‌కి. ఇరవైఏళ్ల నుంచీ సంసారంలోని కష్టసుఖాలు పంచుకుంటూ— ఎలాంటి పరిస్థితులు చుట్టిముట్టినా పెదాలమీద చిరునవ్వు చెరగనీయకుండా ఈ నాడు తన కుటుంబాన్ని ఇంతటి ఉన్నతస్థితికి తీసుకొచ్చింది. అంతటి అనుకూలవతి అయిన భార్య దొరకడానికి తనెంత అదృష్టవంతుడయి ఉండాలి? తనకు కొంచెం అస్వస్థతగా ఉన్నా చాలు, గజగజ వణికిపోతుంది. ఇరవైనాలుగ్గంటలూ తననే కనిపెట్టుకొని కూర్చుంటుంది. ఎంతోమంది దేవుళ్లకు మొక్కుతుంది. తనకు చాల ప్రమాదం జరిగిందని తెలుస్తే, వెంటనే స్పృహతప్పి

# మీరు చవిచూసే ప్రతి హనీ బీ బ్రాందీ గుటకలోనూ ఫ్రాన్సు యొక్క చిన్న భాగం ఉంది














హనీబీ బ్రాందీ చవిచూడండి. ఒక్కసారి
ఫ్రాన్సుకి వెళ్ళిన అనుభవాన్ని పొందండి



## హనీ బీ బ్రాందీ



మార్కెట్ చేయువారు
హెర్బర్ట్‌సన్స్ లిమిటెడ్

తప్పనచ్చు. భయపడిపోయాడు రమణారావ్. గది కర్టెన్ తొలిగించుకొచి నర్స్ హడావుడిగా లోపలికొచ్చింది. ఆమె వెనుకే రాజ్యం. తన ఇద్దరు కొడుకులూ కోడళ్ళూ కూడా వచ్చేశారు. అందరి మొఖాల్లోనూ ఆందోళన, దుఃఖం, భయం అన్నీ కలగలపుగా అలుముకొన్నాయ్.

రాజ్యాన్ని చూసి ఆమెకు ధైర్యం కలుగజేయటానికి ఉత్సాహంగా నవ్వాడు రమణారావ్. అతికష్టంమీద దుఃఖం ఆపుకొంటోందామె.

"మరేంఫరవాలేదుట! చాలా అదృష్టవంతుడినని అంటోంది నర్స్ ..." చిన్నగా మాట్లాడాడతను ఆమె దగ్గరగా వచ్చాక.

కొడుకులిద్దరూ డాక్టర్ దగ్గరకెళ్లి మాట్లాడి తగిలిన గాయల గురించి కుణ్ణంగా తెలుసుకొచ్చారు పాలిపోయిన ముఖాల్తో తిరిగివచ్చిన వాళ్లను చూడగానే గ్రహించుకొన్నాడు రమణారావ్. బహుశా డాక్టర్ ఏదో 'చెడువార్త' చెప్పాడేమో!

# రేసు గుర్రం

"మేం భయపడ్డంత ఇదేంలేదుట ... మరేంఫరవాలేదని అంటున్నాడు డాక్టర్" తండికి ఆందోళన తగ్గించడాని కన్నట్లు మాట్లాడాడు పెద్దకొడుకు.

మరికొన్ని గంటల తరవాత వాళ్ళ ఆదుర్దాకి కారణం తెలుసుకొన్నాడు రమణారావ్. బాండేజ్ కట్టబడివున్న తన కాలికి పాదం లేదు. ఆపరేషన్‌చేసి తీసివేశారది. తాను శాశ్వతంగా కుంటివాడయాడు.

రాజ్యం కాలివంకచూసి వెక్కివెక్కి ఏడుస్తోంది నిశ్శబ్దంగా. కోడళ్లుకూడా ముఖానికి చేతులడ్డం ఉంచుకొని విలపించసాగారు. వాళ్లందర్నీ చూస్తుంటే రమణారావ్‌కికూడా దుఃఖం ఆగలేదు. తనూ ఏడ్చేయసాగాడు.

నాలుగు రోజుల తరువాత శ్రీమంత్ వచ్చాడు పరామర్శించడానికి. అతనితోపాటు కంపెనీ రీజినల్ మేనేజర్ కూడా వచ్చాడు.

"మీకు ఏదయినా, మరో ఉద్యోగం చూపాల్సిందని హెడ్డాఫీస్‌కి రాశాను..." అన్నాడు రీజనల్ మేనేజర్.

రమణారావ్ మొఖం పాలిపోయింది. అంటే తననీ ఉద్యోగంనుంచీ తీసివేశారా? ఎందుకని?

గుర్తుకొచ్చిందతనికి అవును! తనుకుంటివాడిప్పుడు! తను చేసే ఉద్యోగానికి కుంటివాడు పనికిరాడు! తిరగాలి! నెలకి యిరవై రోజులు కాంపులు తిరుగుతూనే ఉండాలి! అందుకని ఆ ఉద్యోగం నుంచి తీసివేయాలనుకొన్నారేమో! పోనీ! ఏదో టేబుల్ వర్క్ ఇస్తే కదలకుండా కూర్చుని ఉద్యోగం చేసుకోవచ్చు!

అతను వెళ్లిపోయాక శ్రీమంత్ దగ్గరగా కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు.

"నామూలాన నీకో అన్యాయం జరిగింది రమణారావ్!..." తలవంచుకొని బాధగా అన్నాడు.

"ఏమిటది ?" తెల్లబోతూ అడిగాడు రమణారావ్.

"ఆరోజు–నన్ను మాబంధువులింటి దగ్గర డ్రాప్ చేసి వెళ్తుంటే మీ జీప్‌కి ప్రమాదం జరిగింది. అందుకని – ఇది కేవలం నువ్ నాకోసం అనధికారంగా జీప్‌ను మా వాళ్ళింటికి తీసుకుపోవడం జరిగిందని హెడ్డాఫీస్‌కు తెలిసిపోయింది. అదీగాక టూర్ చేసే పరిస్థితిలో కూడా నువ్వు ప్రస్తుతం లేవు. అంచేత నిన్ను ఉద్యోగంలోనుంచి బర్తరఫ్ చేశారు..."

నివ్వెఱపోయాడు రమణారావ్! అదేమిటి? ఇంత త్వరగానా? తనింకా హాస్పిటల్ నుంచయినా బయట పడలేదు! బహుశా ఇదంతా జీప్‌లో శ్రీమంత్ బంధువులింటివేపు వెళ్ళడం మూలాన జరిగి ఉంటుంది. ఇలాంటి విషయాల్లో కంపెనీ చాలా స్ట్రిక్ట్‌గా ఉంటుంది. తనకు తెలుసా విషయం! కానీ శ్రీమంత్ కోరిక కాదనలేక అందుకు ఒప్పుకొన్నాడు. దాని మూలాన జరిగింది ...

"అయినా ఫరవాలేదు! నేను జరిగిందంతా రీజినల్ మానేజరుగారికి చెప్పేశాను. ఆయన ఎట్లాగన్నా నిన్ను ఏదొక ఉద్యోగంలో ఉంచే ప్రయత్నం చేస్తున్నారు..."

మరికాసేపు మాట్లాడి అతను కూడా వెళ్ళిపోయాడు.

రమణారావ్ ఆలోచనలన్నీ ఉద్యోగం గురించే! ఇప్పుడు ఉద్యోగం పోయింది. అంటే నెలకు తొమ్మిదివందల రాబడి పోయిందన్నమాట! ఆ జీతం తన కుటుంబాన్నంతటిని పోషిస్తోంది. కొడుకులకూ, కోడళ్ళకూ బట్టలు – మనవలకు ఆటవస్తువులూ–అలాంటివన్నీ కూడా అందులోనుంచే ఇప్పుడది కాస్తాపోతే.

"పోతేపోనీ నాన్నా వెధవుద్యోగం! నేనూ తమ్ముడూ సంపాదిస్తూనే ఉన్నాంగా!..." మీ కింక ఉద్యోగం చేయాల్సిన అవసరం ఏమిటి?" అన్నాడు పెద్దకొడుకు.

మరికొన్ని రోజులకు హాస్పిటల్ నుండి డిశ్చార్జ్‌అయి ఇల్లు చేరుకొన్నాడు రమణారావ్.

చేతికర్ర సహాయంతో ఇంట్లోకిగెంతుతూ నడుస్తుంటే ఆయన కళ్ళవెంబడ నీళ్ళు తిరిగినయ్. సాధారణంగా తనెక్కడికి కాంప్ వెళ్ళినా, వచ్చేముందు ఫోన్ చేసి ఇంటి కొస్తూండేవాడు. తనకోసం, రాజ్యం, కోడళ్ళ పెద్దాడి పిల్లలు–ఎంతో సంతోషంగా ఎదురుచూస్తూండేవాళ్ళు. ఇక ముందు ఆ ఆనందం తనకూ. వాళ్ళకూ కూడా కరువవుతుంది కాబోలు.

గదిలోకి అడుగు పెడుతూండగానేపిల్లలు సంతోషంగా వచ్చి ఆయనను చుట్టేశారు.

"తాతయ్యా! ఈ కర్రలెందుకు?..." చిన్నాడు అడిగాడు.

"కాళ్ళు నొప్పిగా ఉన్నయ్యమ్మా! అందుకని... వీటిని పట్టుకొని నడుస్తున్నాను..."

మంచంమీద కూర్చుని కర్రలు దూరంగా ఉంచాడతను.

మరికొన్ని రోజులు గడిచినయ్. ఆయనకు ఎలాంటి ఉద్యోగమూ ఇవ్వడానికి కంపెనీ అంగీకరించలేదు. దాంతో మానసికంగా బాధ పడిపోసాగారాయన. దేముడు ఈ వయసులోనే తనని మూల కూర్చోబెట్టేసేడే? కాలు లేక పోవటం పెద్దగా బాధ కలిగించలేదాయనకి. కొద్ది రోజుల్లోనే కర్రలతో నడవడం బాగా అలవాటయిపోయింది. మొదట్లో భుజాలు కొంచెం నొప్పిపుట్టేవిగాని, రానురాను అది కూడా తగ్గిపోయింది అదీగాక అనుక్షణం రాజ్యంతనని కనిపెట్టుకొనే ఉంటుంది. ఎంత వారించినావినదు. ఎప్పుడూ అనుకొంటూ ఉంటుంది "భగవంతుడుకి ఈమాత్రమయినా నామీద కనికరముంది. అందుకే ఆయన ప్రాణానికేం ముప్పు వాటిల్లలేదు..."

రానురాను ఇంటి వాతావరణంలో మార్పు స్పష్టంగా కనిపించసాగింది రమణారావ్‌కి. కొడుకులు–కోడళ్ళు తన విషయం అదివరలా పట్టించుకోవడంలేదు. చాలా విషయాలు తనకు తెలీకుండానె జరిగిపోతున్నాయ్. అదివరకు ఇంట్లో ఏం జరిగినా తన అనుమతి లేనిదే జరిగేదికాదు. దగ్గరుండి భోజనం వడ్డించే కోడళ్ళు - అసలిప్పుడు భోజనం దగ్గరే కనబడటం లేదు.

కొడుకులు సరేసరి – తనతో అదివరలా మాట్లాడడమేలేదు. చిన్నకోడలికి కూడా కూతురు పుట్టడంతో ఇంట్లో కలతలు మొదలయినయ్ ప్రతి విషయానికీ నాదీ నీదీ అన్న భావం మొదలయింది. రోజు రోజుకీ మనస్పర్ధలు పెరిగిపోవడం చూసేసరికి రమణారావ్‌కి ఆదుర్దా పెరిగిపోసాగింది. చివరకు ఆ రోజు కూడా రానేవచ్చింది. ఆఇంట్లోనే వేరు వేరుగా వంటగదులు తయారయినయ్

రమణారావ్‌కి నవ్వొచ్చింది.

తను తొమ్మిదివందలు సంపాదించి అంతా ఇంట్లోఖర్చుకే వినియోగించేవాడు. అప్పుడు–తనని విళ్ళిద్దరూ కలిసి ఎంతో గౌరవంగా చూసేవాళ్ళు. తను చెప్పింది వేదవాక్కుగా భావించేవాళ్ళు. ఇప్పుడేమో తను సంపాదించటం చేతకాని వాడయేసరికి తనని మూలకు విసిరేసి–వాళ్ళల్లోవాళ్ళు తగూలాడు కొంటున్నారు. ఎవరి డబ్బు వాళ్ళకంత ప్రీతి కాబోలు –

ఓరోజు పెద్దకొడుకు వచ్చి రమణారావ్ దగ్గర నుంచున్నాడు

"నీతో మాట్లాడాలి నాన్నా..." అన్నాడు నెమ్మదిగా.



# రేసుగుర్రం

"ఏమిటది ?"

"నాకు ఇక్కడి నుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. ఎల్లుండి వైజాగ్ వెళ్లిపోవాలి! తమ్ముడూ, నేనూ ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చాము. అమ్మా — నువ్వూ — మీ ఇద్దరిలో ఒకరు నాదగ్గర మరొకరు తమ్ముడి దగ్గర ఉంటే బావుంటుంది!" గుండెలు పిండేసి నట్లయింది రమణారావ్‌కి. ఆఖరికి తనూ, రాజ్యంకూడా ఈవయసులో ఒకరి కొకరు తోడులేకుండా దూరం దూరంగా బ్రతకాలా? వాళ్లు తమ భార్యలతో కలిసి ఉండాలని అనుకొంటున్నట్లే తనూ తనభార్యతో కలిసి గడపాలని అనుకోడా ?

పైగా ఇలాంటి నిస్సహాయ స్థితిలో ఉన్న ప్పుడు — భార్య అవసరం తన కెంతేనా ఉంటుంది.

కానీ ఆ విషయం వాళ్లకు తెలియజేయ టం ఎలా ?

తామిప్పుడు పూర్తిగా వాళ్లమీద ఆధార పడి ఉన్నారు, వాళ్లేంచెబుతే అది విని తలూ పాల్సిందే.

" ఏమంటారు ? " అడిగాడు పెద్ద కొడుకు.

"మీ ఇష్టం వచ్చినట్లు చేయండ్రా! మీరేంచేసినా నాకు సమ్మతమే!"

అతను వెళ్లిపోయాడు.

తమ సంభాషణ వింటూన్న రాజ్యం లోలోపలే కుళ్లి కుళ్లి ఏడుస్తోంది. ఆమెను చూస్తూంటే రమణారావ్‌కీ దుఃఖం ఆగలేదు.

"ఊరుకోవే పిచ్చిదానా! దేముడు కావా లనే మనకి అన్యాయం చేశాడు. ఇంక ఎవరితో మొరపెట్టుకొందాం..."

"నేను మిమ్మల్నివిడిచి ఉండలేనండీ ... ఇంతవరకూ ఎప్పుడూ ఉండలేదు ... " ఏడుస్తూనే అందామె.

"రమణారావేమీ మాట్లాడలేకపోయాడు. హృదయం బరువెక్కిపోయింది. ఆ రాత్రికి సామాన్లన్నీ లారీలో వేశేశారు.

"మీరు ఇక్కడే ఉండండి నాన్న! అమ్మని నేను తీసుకెళ్తున్నాను..." అన్నాడు పెద్దకొడుకు.

అది కొంతవరకూ నయమనిపించింది రమణారావ్‌కి. ఈ ఇల్లంటే తన కిష్టం! తన చేతులో కట్టించాడు దీన్ని! చనిపో యేంతవరకూ ఈ ఇంట్లోనే గడిపేయాలని అనుకొన్నాడు.

మర్నాడు ప్రయాణానికి సన్నాహాలు మొదలయినయ్. రాజ్యం ఉదయం నుంచీ తన దగ్గర కూర్చుని ఏడుస్తోనేఉంది. ఆమెను ఎలా ఓదార్చాలో తెలీటంలేదు రమణారావ్‌కి. పై పెచ్చు ఉండుండి తనకి కూడా దుఃఖం ముంచుకొస్తోంది. నిజంగా ఈ ఎడబాటు కంటె చావు మంచిదేమో అనిపిస్తోంది.'

వాళ్లు వెళ్లిపోయారు.

కొన్ని రోజులు పిచ్చెక్కినట్లయిపోయింది లతనికి. ఇల్లంతా బావురుమంటూ — అను క్షణం రాజ్యం గుర్తుకొస్తూ — చిత్రవధ అనుభవించాడతను.

ఆరునెలలు గడిచిపోయినయ్. శారీరకంగా మానసికంగా బాగా కృంగిపోయాడు రమణ రావ్! కొడుకు ఇంట్లో ఉంటూన్నట్లు అని పించటంలేదు. ఓ జైల్లో ఉంటున్నట్లుంది.

రోజూ సాయంత్రం కర్రలతో నెగెంతుతూ మెయిన్‌రోడ్ వరకూ వెళ్ళి అక్కడ కాసేపు పార్కులో కూర్చొని ఇంటికి రావడం! అదొ క్కటే తనకి ఆనందం కలిగించే విషయం! పార్కులో కూర్చున్న కొద్దిసేపూ అన్ని విష యాలూ మర్చిపోగలుగుతున్నాడు. చుట్టూ పిల్లల ఆటలు. కేకలు- నవ్వులు - తనని తాను మర్చిపోయేట్లు చేస్తున్నాయ్!

రాన్రాను కోడలు విసుక్కోవడం ఎక్కు వయింది.

"వాళ్లు చక్కగా పనిచేయించుకోడానికి ఆ ముసలమ్మను పట్టుకుపోయారు. ఈ మగ మనిషికి ఆ మాత్రం తెలివిలేదు. అవిటి మనిషిని ఇంట్లో ఉంచుకోటానికి వప్పు కొన్నారు. చేసేది నేనా? తనా? తనకేం హాయిగా ఆఫీసులో కూర్చుని రాత్రికి కొంపకు చేరుకొంటారు. నావల్లకాదు అడ్డమైన వాళ్లకీ చాకిరీ చేయడం—"

అలాంటి మాటలు— తనని కించపరచే వేష్టలూ కూడా సహించటం నేర్చు కొన్నాడు రమణారావ్. కాని మనశ్శాంతి పూర్తిగా కరువయిపోయింది.

ఆ రోజు సాయంత్రం నెమ్మదిగా పార్కు వైపు బయలుదేరాడాయన.

మెయిన్‌రోడ్డు మీద రద్దీ ఎక్కువగావుంది. జాగ్రత్తగా అటూ ఇటూ చూస్తూ కర్ర లతో రోడ్డు దాటసాగాడాయన.

ఓ కారు అతని దగ్గరగా వచ్చి సడెన్ బ్రేకులతో ఆగిపోయింది.

కార్లోంచి జగన్ దిగాడు.

అతన్ని చూసి ఆశ్చర్యపోయాడు రమణారావ్.

"ఓరి! నువ్వట్రా ఎవరా – నాదగ్గర కారాపుతున్నాడూ అని చూస్తున్నా?..." అన్నాడు నవ్వుతూ.

"నేనేరాబాబూ! అంతదూరంనుంచే నిన్ను గమనించాను! ఈ క్రఅలూ – అవీ చూసి నువ్వుకాదేమో అన్న అనుమానం కూడా వచ్చింది. ఏమిటీ అవతారం? కాలికేమయింది? – పద కార్లో కూర్చో! అలా ఆబిడ్స్ వరకూ పోయొద్దాం!" కార్లో కూర్చున్నాడు రమణారావ్. కారు ఆబిడ్స్ వేపు బయల్దేరింది.

పదినిమషాల్లో ఇద్దరూ అన్నపూర్ణా హోటల్లో ఓ ఎయిర్‌కండిషన్డ్ రూమ్‌లో కూర్చున్నారు.

"ఊ! ఇప్పుడు చెప్పరా! ఏమిటీగొడవ? కాలు ఎలా విరిగింది–"

జరిగిందంతా చెప్పాడు రమణారావ్.

"రాస్కెల్! కాలువిరిగింది – ఉద్యోగం పోయింది – అంత మాత్రానికి అలా కృంగిపోవాలా? ఇంత చిన్న విషయాలకి అలా భయపడిపోతే ఎలాగురా? జీవితమంతా ముగిసిపోయినట్లే మాట్లాడుతున్నావ్? చూడు మనిషివి ఎలా తయారయ్యావో! నీకు నలభై ఆరేళ్లంటే ఎవరన్నా ఏమంటారో తెలుసా? కనీసం యాభై అయిదన్నా ఉంటాయంటారు. అలాఉన్నావ్ నువ్వు! మనిద్దరిదీ ఒకటే వయసుకదా! నేను చూడు ఎలా ఉన్నానో..."

ఆరాత్రి అక్కడే భోజనం చేశాడు రమణారావ్ అతని బలవంతంమీద.

'నువ్వింకా విజయవాడలోనే ఉన్నావుట్రా' అడిగాడు రమణారావ్.

"ఇంకెక్కడికి పోతాన్రా ఉద్యోగం మానేశానన్న సంగతి నీకు తెలుసుకదా! ఆపొలాలు చూసుకొంటున్నాను? అంతే! ఇక డబ్బు ఖర్చుచేయడానికిలా ఒకటి రెండు సార్లు సర్దాగా హైదరాబాద్ వచ్చిపోతుంటాను..."

"బాగుంది ..." నవ్వాడు రమణారావ్ "నీకేంరా నాయినా! లక్షాధికారివి! డబ్బు ఖర్చుచేయే మార్గాలు వెతక్కా ఏంచేస్తావ్?"

"లేకపోతే ఏం చేయమంటావురా! ప్రభుత్వానికి సమర్పించుకోవాల్సి వస్తుంది. ప్రభుత్వానికిచ్చేబదులు– సర్దాగా రేసులమీద తగలేస్తే బావుంటుంది! మన సరదా తీరినట్లూ ఉంటుంది... ఏమంటావ్?"

## రే సు గు ర్రం

"అయితే ఇప్పుడు రేసులాడ్డాని కొచ్చావన్నమాట!

"అవున్రా బాబూ! రేపంతా అదేపని!

అన్నట్లు నువ్వు ఇంటిదగ్గరే ఉంటావ్‌గదా! రేపు నాతో సర్దాగా రేసులకి రాకూడదూ?"

"నాకెందుకులేరా ఇవన్నీ.. ఏనాడూ వాటి జోలికి పోలేదు!"

"ఈజిట్! అలా అయితే తప్పకుండా

రావాల్సిందే! రేసులాడకపోయినా సర్దాగా చూడాలిరా! ఎంత థ్రిల్లింగ్‌గా ఉంటుందో నీకేమయినా తెలుసా?..."

మరికాసేపు మాట్లాడిన తర్వాత కార్లో రమణారావ్‌ని అతనింటిదగ్గర వదిలాడు జగన్

'రేపు మధ్యాహ్నం పదకొండింటికల్లా వచ్చేస్తాను! రడీగాఉండు! రేస్‌కోర్స్‌కెళ్దాం" అన్నాడతను.

"నేనెందుకులేరా! నువ్వెళ్లిరా! అంతగ్గా వాలంటే సాయంత్రం కలుసుకుందాం!"

అలా అన్నాడుగానీ, రమణారావ్‌క్కూడా జగన్‌తో తిరగాలనే ఉంది. వాడి మాటల్లో తను ఓ విధమయిన ఆనందం పొందుతున్నాడు. తనని తను మరిచిపోగలుగుతున్నాడు. చిన్ననాటి విషయాలు వాడు గుర్తు చేస్తోంటే ఒకటొకటే గుర్తువస్తున్నయ్ తనేనాడో మరిచిపోయాడవన్నీనూ

"అదేం కుదర్దు – రావాల్సిందే! ఇంక ఉంటాను..." వెళ్లిపోయాడతను. రమణారావ్ ఇంట్లోకి నడిచాడు.

భోజనం హోటల్లో చేసివచ్చాడని తెలీగానే కోడలు విరుచుకుపడింది. "ఇక్కడేం ఎక్కువవడంలేదు ఎవరికీనూ! చాలీచాలక ఓపక్కన చస్తూంటే ఇంక వండింది పారవేయడం కూడానూ!—"

రమణారావ్ మాట్లాడకుండా కళ్లు మూసుకొని పడుకొన్నాడు.

ఉదయం పదకొండవుతూండగానే ఇంటి ముందు కారు హారన్ మోగింది.

జగన్ సరాసరి లోపలికొచ్చేశాడు.

"ఏరా! రడీయేనా? పద మరి పోదాం!"

అతని వెనుకే కర్రతో బయటకు నడిచాడు రమణారావ్.

కారు రేసు కోర్సుకు చేరుకుంది.

ఇద్దరూ పక్క పక్కనే కూర్చున్నారు. రేసుల గురించీ గుర్రాల పేర్లు వాటి కుటుంబ పుట్టుపూర్వోత్తరాలూ ఉత్సాహంగా చెప్పుకు పోతున్నాడు జగన్.

ఆశ్చర్యంగా వింటున్నాడు రమణారావ్. అతనికి మరో ప్రపంచంలో అడుగు పెట్టినట్లుంది. ఎవరు మాట్లాడినా గుర్రాల గురించే!

రేస్ ప్రారంభమయింది. గుర్రాలు పరిగెడుతున్నాయ్! అతివేగంగా శక్తికొద్దీ పరిగెడుతున్నట్లున్నాయ్! కళ్లప్పగించి చూస్తున్నాడు రమణారావ్. అవి అంత వేగంగా పరిగెట్టటం-తను కొన్ని ఇంగ్లీష్ సినిమాల్లో చూశాడు. ప్రత్యక్షంగా చూడటం ఇదే మొదటిసారి!

"అదిగో ఆ రెండో గుర్రం చూడూ! అదే నా గుర్రం! అన్నింటినీ ఎలా దాటు కెళ్లిపోతోందో చూడు! దానిమీద ఎంత కాశానో తెలుసా? వెయ్యిరూపాయలు! కమాన్...కమాన్..." లేచి నుంచునే అరవసాగాడు జగన్. ఇంచు మించుగా అక్కడి జనమంతా కేకలు వేస్తున్నారు. మధ్యలో

## నమ్మూ నమ్మకపో!

- ★ స్పెయిన్‌కు చెందిన (1801-1871) "సెన్యోరా సాచినా ట్యోరి జోస్" అనే స్త్రీ అద్దంముందు పుస్తకాన్ని వుంచి చదవగలిగేదిట! ఆమె ఎడమ చేతితో వ్రాసేది. కుడిచేతితో వెనక్కి మామూలుగా వ్రాసేది.
- ★ ఫ్రెంచి దేశపు రాజుచే విడాకులివ్వబడిన రాణి మార్గరెట్ 34 జేబులున్న పెద్ద గౌను ధరించేది. ప్రతి జేబులోనూ ఆమె మాజీ భర్త నామము దికలుగల పెట్టెను పెటి కూడా తీసుకొని వెళ్లేదట.
- ★ 1869 లో ఇంగ్లండ్‌లోని యార్‌మౌత్‌లో ఒక కుక్క వార్తాపత్రికలను చందాదారులకు చేరవేసేదిట
- ★ ఆస్ట్రేలియాలోగల వానపాములు వాని పొడవును 10 అడుగులనుంచి 20 అడుగుల వరకు పెంచగలవు.

-చావలి సుబ్బలక్ష్మి

విజిల్స్ కూడా వినబడుతున్నాయ్.

రమణారావ్ ఉత్సాహంగా చూస్తున్నాడు

హటాత్తుగా జగన్ ఆడిన గుర్రం దబ్బున ముందుకి పడిపోయింది. జాకీ ఎగిరి పడ్డాడు కింద. బాధతో గిల గిల కొట్టుకొందా గుర్రం!

జనమంతా హోరున అరిచేశారు.

జగన్ తన తల రెండు చేతుల్తోనూ పట్టుకొని కూర్చుండిపోయాడు.

"ఆ గుర్రం పోవడం నాకు చాలా బాధగా వుందిరా! ఎన్నో రేసులు దానిమీద ఆడి గెలిచాను..."

"దానికి బాగా దెబ్బతగిలుంటంది కదూ" జాలిగా అడిగాడు రమణారావ్.

"దెబ్బ ఏమిట్రా బాబూ! నాలుగయిదు ఫ్రాక్చర్లయి వుంటయ్!..."

"అంటే అదింక రేసులకి పనికిరాదా?" ఆత్రుతగా అడిగాడు రమణారావ్.

"ఊహూ! దాని చాప్టర్ క్లోజయినట్లే"

రమణారావ్‌కి ఎందుకో గుండెల్లో కలుక్కుమంది. తన జీవితానికీ- దాని జీవితానికీ ఏదో సాపత్యం ఉన్నట్లనిపించింది.

"మరిప్పుడు దాన్నేం చేస్తారు?"

"కాల్చిపారేస్తారు..."

త్రుళ్లిపడ్డాడు రమణారావ్! "కాల్చేస్తారా"

"అవును!"

"అదేమిటి కాల్చెయ్యడం ఎందుకు?"

"లేకపోతే ఇంకెందుకది? దానిమూలాన ఏం ఉపయోగ ముంటుందని?"

"ఉపయోగం లేనంతమాత్రాన అలా చంపేస్తారా?"

"అవ్వనా! బతికుంటే తిండి దండగ కాదూ?"

రమణారావ్ మనసంతా వికలమయిపోయింది. లేవడానికి పయత్నించి మళ్ళీ పడిపోయిందా గుర్రం. ఎంత బాధగ ఉందో దానికి! జగన్ చెప్పిందికూడా నిజమే! ఆ గుర్రం బతికుండటం కంటె చావడమే మంచిది! ఎవ్వరూ చూడక- తినడానికి మేత దొరక్క- అందరూ తరిమికొట్టి – ఆ బాధలతో చావడం కంటె- దాన్ని బలవంతంగా చంపడమే మంచిది బాగున్నాళ్లూ – రేసుల్లో పరిగెత్తినన్నాళ్లూ-దానిని ఓదేవతలా పూజించి – పోషించి –దెబ్బతిన్నప్పుడు చీదరించుకొని తరిమికొట్టే–మనుషుల్లో బతకడంకన్న ఖచ్చితంగా చావేమంచిది.

సాయంత్రానికి కార్లో ఇంటిదగ్గర దేర్చి వెళ్లిపోయాడు జగన్.

రమణారావ్‌కి ఆరాత్రంతా నిద్రపట్టలేదు. అతనికి స్పష్టంగా తెలుస్తోంది. తనో రేసు గుర్రం! సంపాదించినన్నాళ్లూ తనను అందరూ పూజించారు.

ఇప్పుడు తను కుంటిగుర్రం అయాడు.

అందువేత తనూ బలవంతంగా చంపబడాలి!

ఉదయం రమణారావ్ లేవలేదు. ఆ ఇంట్లోంచి ఏడుపులు వినిపించినయ్.

# సైనిక్ స్కూలు, కోరుకొండ

## 1976 సెషన్‌లో VI క్లాసులో ప్రవేశము

**VI** వ తరగతి ప్రవేశమునకు మాత్రము 1976 ఫిబ్రవరి 21 మరియు 22వ తేదీలలో అఖిలభారత ప్రవేశ పరీక్షలు నిర్వహించబడును. 2వ జూలై 1965 తర్వాత మరియు 1 వ జూలై 1966కు ముందు జన్మించిన బాలురు మాత్రమే అర్హులు. కనీస విద్యార్హతలు నిర్ణయించ లేదు. ఇంగ్లీషుయందు పరిజ్ఞానము అవసరము లేదు. బాలురు ఈ పరీక్షను తెలుగు/ఇంగ్లీషు/హిందీ/ఉర్దూ లేక గుర్తింపబడిన ఏ యితర భాషలోనైన వ్రాయవచ్చును. ఆంధ్రప్రదేశ్ యందు కోరుకొండ, ఏలూరు, గుంటూరు, అనంతపూరు, తిరుపతి, మరియు హైదరాబాదు కేంద్రములలో పరీక్షలు జరుపబడును. 20 మంది అభ్యర్థులు పైబడి ఉన్నచో నిజామాబాద్ కేంద్రములో కూడ పరీక్షలు జరుపబడును. *సుమారు సీట్ల సంఖ్య 55.* షెడ్యూలు కులములు, షెడ్యూలు తెగల అభ్యర్థులకు వయోపరిమితిలో సడలింపులు అనుమతించబడవు. కాని ప్రవేశ పరీక్షలో వారు పొందే అర్హతనుబట్టి మెరిట్‌లిస్టుతో సంబంధము లేకుండా ప్రవేశము కల్పించబడును. వీరికి అర్హత ప్రమాణములలో కూడ కొంత సడలింపు వుంటుంది.

లభించు స్కాలర్‌షిప్పులు : [ఏ] ఆంధ్రప్రాంతంలో నివసించు బాలురకు రాష్ట్రప్రభుత్వముయొక్క ఉదార ఉపకార వేతనములు లభించును. తల్లిదండ్రులు వారి ఆదాయము ననుసరించి చెల్లించవలసిన సాలుసరి రుసుము *(1) రు.0-300 : రు 25 (2) రు.601—1000: రు.1100 (3) రు 301 600 రు. 350 (4) రు. 1001-1600 : రు. 1850.*

[బి] రక్షణదళములకు చెందిన (మాజీ సైనికులతో సహా) వ్యక్తుల కుమారులకు డిఫెన్స్ స్కాలర్‌షిప్పులు మరియు యానంలో స్థిరపడినవారికి యూనియన్ టెరిటరీ స్కాలర్ షిప్పులు లభించును. స్కాలర్ షిప్పులను వుపయోగించుకుని ఎన్నికైన పక్షంలో నేషనల్ డిఫెన్స్ ఎకాడమీలో చేరవలెను.

ప్రాస్పెక్టసు (దరఖాస్తు ఫారమునకు నమూనా ప్రశ్నాపత్రములు చేరినసెట్టుకు) [ఏ] రు. 3-00 లకు క్రాసు చేసిన పోస్టల్ ఆర్డరు *ప్రిన్స్‌పాల్, సైనిక్ స్కూలు, కోరుకొండ* పేరున వ్రాసి సైనికల్ స్కూల్ (కోరుకొండ) సబ్ ఆఫీసులో మార్చుకొనుటకు వీలుగా పంపవలెను. [బి] సొంత చిరునామ కవరు 9"X4"తో 85 పైసల స్టాంపు పంపించి సాధారణ పోస్టుద్వారా తెప్పించుకో వచ్చు. రిజిస్టర్డు పోస్టులో కోరువారు రు. 2-10 స్టాంపులు పంపించవలెను. [సి] నమూనా ప్రశ్నాపత్రములు (తెలుగు లేక ఇంగ్లీషు లేక హిందీ లేక ఉర్దూ) భాషలలో కావలసినవారు దరఖాస్తు ఫారములో స్పష్టంగా వ్రాయవలెను.

పూర్తి చేసిన దరఖాస్తులు రు. 5లు క్రాసుచేసిన పోస్టల్ ఆర్డరును జతపరచి (రిజిస్ట్రేషన్ ఫీజు నిమిత్తం) ఈస్కూలుకు 24 జనవరి 1976 తేదీలోపు పంపవలెను.



## యౌవ్వనం తెచ్చే వ్యాధి

పాట్నాలో "ఇడియోపతిక్ ప్రికాషియస్" అనే ఒక రకం వ్యాధి సోకిన మూడున్నరేళ్లబ్బాయిని ఆసుపత్రిలో చేర్చారట. ఈ వ్యాధి సోకిన (పిల్లలకున్నూడా) వారికి యవ్వన లక్షణాలు వెంటనే వచ్చేస్తాయట. ఈ మూడున్నరేళ్ల బాలునికి యవ్వనం యిచ్చే ఒంటి మార్పులు చేర్పులు అన్నీ వచ్చేశాయట. సామాన్యంగా మూడేళ్ల పిల్లలు 87 సెంటిమీటర్ల ఎత్తుంటే, యీ యువక కుర్రాడు 127 సెంటిమీటర్లున్నాడట— వార్నీ!!

## కోటివిద్యలు కూటి కొరకే

బొంబాయిలో 39 ఏళ్ళమ్మాయి (అనొచ్చు) వేరే ఏం చెయ్యాలో తోచక, తనకొచ్చిన మంత్ర శక్తులతో విగ్రహాలనుంచి కుంకుమ రప్పించగలనని ప్రజలను వెర్రెత్తేలా చేస్తోందట. ఆవిడ చెయ్యబోయే ఘన కార్యం చూడ ప్రజలు వెర్రెత్తిపోతున్నారట. భక్తుల వద్దనుంచి యింత వరకూ ఆమె లక్ష రూపాయల వరకూ క్రైం కర్యం చేసుకున్నదట. పోలీసులు చెక్ చేసుకుని చూస్తే ఆమెవద్ద ప్రస్తుతానికో యాభై రెండు వేల రూపాయలు దొరికాయట.

### పట్టువదలని విక్రమార్కుడు

లండన్‌లో బల్దేవ్‌సింగ్ భహోత్ అనే ఆయన శిరోధారణం (హెల్మెట్) లేకుండా మోటారు సైకిలు తోలినందుకు ముప్పయ్యొయిదోసారి అరెస్టయ్యాడట. కోర్టులో జడ్జి విధించిన అపరాధాన్ని ఆయన కట్టనిరాకరిస్తూ "నన్ను మీ యిష్టం వచ్చినన్ని సార్లు పట్టుకోండి. ఇష్టం వచ్చినంత ఫైను వేయండి. ఫైనులో పైసా కూడా నేను కట్టేది లేదు. నా ఆస్తి పాస్తులన్నీ జప్తు చేసుకోండి. మీ యిష్టం. జైలుకు రమ్మంటారా, హాయిగా వస్తాను. ఎప్పుడు ఏ జైలుకైనా సరే సిద్ధమే. ఆ మీదట మీ యిష్టం. హెల్మెట్ ధరించేది లేదు, ఫైను కట్టేదీ లేదు. మా మతం ప్రకారం వేనీ తలపాగాను వదిలేదిలేదూ. అవును. య్యాస్" అన్నాడట సుబ్బరంగా. ఈ ధోరణికి ఆశ్చర్యపోని జడ్జిగారు "ఏ చోట వుంటే ఆచోటి నిబంధనలు పాటించాలిస్మి" అన్నారట. బల్దేవ్ సింగ్ "టించను" అన్నాడట—అనకేం జరిగిందో!




# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిను మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది! బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి !




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-B3C.GL-10-140 TL

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### డి. యస్. పి. — యలమంచిలి

వేసవికాలంలో సెగగడ్డలు తరచూలేస్తాయి. పెన్సిలిన్ వాడినా పోవుటలేదు. ఏమందులు వాడాలి?

వేసవికాలంలో ఎక్కువగా 'సెగగడ్డలులేవటం'' చర్మంలోని స్వేదనాళములు, చెమట ఎక్కువగా ఉత్పత్తి అవటంవలన మొదలయి ఆ నాళములకు అడ్డుపడి, రోగ కారక క్రిములుచేరి బాగా పెరిగే అవకాశము లేర్పడటంవలననే! మందులు వాడటం, ఈ రోగమునకు కారణాలైన క్రిములను బట్టి నిర్ణయించాలి. అన్ని వేళలా 'పెన్సిలిన్' కే నయమయ్యే క్రిములే కారణాలు అయి ఉండవు.

### ఏ. ఎస్. — నెల్లూరు

నాకు 16 సంవత్సరములు నాకు 'పల్మోనరీ స్టినోసిస్' అను గుండెజబ్బువున్నది. ఇది నాకు పుట్టిన దగ్గరనుండి వున్నది. దీనికి నివారణ పద్ధతి తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పండి.

పల్మోనరీ స్టినోసిస్ అనేది పుట్టుకతోనే వచ్చే గుండె జబ్బు. హృదయమునుంచి ఊపిరి తిత్తులకి చెడురక్తాన్ని తీసుకువెళ్ళే మార్గ ప్రారంభంలో ఉన్న కవాటద్వారం చిన్నదిగా వుండటమే ఈరోగం. దీనికి నివారణ రోగి లక్షణాలను బట్టి ఉంటుంది. పెద్దగా రోగికి హాని చేకూర్చేటట్లుగా ఉంటే శస్త్ర చికిత్స తగినమార్గం. తాత్కాలికంగా మాత్రమే మందులు వాడవచ్చును.

### పి. సి. ఎస్. ఆర్. — విజయవాడ

నాభార్య ఏనస్ చుట్టూ, పైనా, లోపల కూడా దురదలు, 15 సంవత్సరాలుగా కాన్స్టిపేషన్ ఉన్నాయి. 13 సంవత్సరముల క్రితం పైల్స్‌కు ఆపరేషన్ జరిగింది. లిక్విడ్ పేరాఫిన్‌గాని, మోషన్ కుగాని మందు వేసుకుంటే తప్ప విరేచనమవదు. లేడీ డాక్టర్ ఫిషర్ ఏర్పడిందన్నారు. ఎన్నిమందులు వాడినా, మర్మా వయవం బైట దురదలు, గోకిన తర్వాత పుండుపడి, మానిన తర్వాత చర్మం నల్ల బడిపోతూ అది దురదలు. తగ్గవు...

మీ భార్య మీరు నెత్తురులో "వి. డి. ఆర్. ఎల్" (లేకపోతే ఖాన్స్‌టెస్ట్) పరీక్ష చెయించుకోవటం చాలా అవసరం. విరేచనం అవకపోవటానికి కొన్ని కారణాలు—ముఖ్యంగా ఆహారం, అలవాటు మొదలయినవి చాలా ఎక్కువ పాత్ర వహిస్తాయి మలం గట్టిగా ఉంటే ఫిషర్ ఏర్పడటం సహజం. మర్మావయంపై దురదలు మొదలయిన వాటికి రోగ నిర్ధారణ రక్త పరీక్ష తర్వాత తేలగలవు.

### ఎస్. ఎం. ఆర్. — కొమరగిరి పట్నం

"నావయస్సు 17 సంవత్సరాలు బుగ్గలు చాలా ఎత్తుగావున్నాయి. అందవికారంగా కూడావున్నాయి."

బుగ్గలు ఎత్తుగా ఉండటానికి చాలా కారణాలు ఉన్నాయి. పుర్రె నిర్మాణంలోనే ఏర్పడగల కొన్ని మార్పులు కుటుంబ పర్యాయంగా (వంశపారం పర్యంగా) కొందరికి కంటిక్రింద భాగంలోని ఎముకలు ఎత్తుగా ఉండటం బుగ్గలవద్దనున్న కండరాలు క్రొవ్వు పెరగటం (వ్యాయామం మొదలయిన వాటివల్ల ఎక్కువగా కండరాలు అభివృద్ధి చెందవచ్చును. ఇవి అందవికారంగా తయారయితే ఏబ్యాటిక్లినిక్‌లోనో సంప్రదించండి. వైద్యశాస్త్రరీత్యా దీనికి తగిన నివారణమార్గాలు ఎక్కువగా లేవు—ఎముకలు రోగ గ్రస్తమయి వాచిపోతే తప్ప.

### బి. డి. ఆర్. రాజంపేట

కొందరు తమ వ్యాధులు ఇతరులకు చెప్పుకో లేక డాక్టర్లకు చూపించలేక భయముచేతనో సిగ్గుచేతనో మీకు వ్రాసే ప్రతివారు పూర్తిపేరు పొడి అక్షరాలతో పంపుచున్నారు. అట్టివారికి మీరే మందులుగాని, ఇంజక్షన్లు గాని తెలుప కూడదా?

మీరు నిశితంగా ఆలోచిస్తే నేను, వ్రాయటంలోని అర్థం బోధపడుతుంది. ఎంతోదూరములో ఉన్న ఒక రోగి తన రోగ లక్షణాలను ఉత్తరం ద్వారా వ్రాసి పంపటం— దానిని గ్రహించి ఏదో 'ఫలానా' రోగం అని నేను నిర్ణయించటం దానిమీద మందులు వాడటం— ఎంతో సమస్యాత్మకమైన విషయం. మందులు వ్రాయటం రోగాన్ని బట్టి ఉంటుంది. కాబట్టి, రోగనిర్ణయం నా వూహను అనుసరించి ఉండటం వల్ల — ఫలానా రోగం, కారణాలు, వైద్యక్రమం సూచించి వైద్యుల సలహాతో వాటిని వాడమనటం మీకే మంచిది.

### వి. ఆర్. విశాఖపట్నం

నా వయస్సు 17 సం. లు 1972 నుండి తలపోటు వారానికి ఒకసారి వస్తున్నది. ఒకరోజంతా వుంటుంది. ఆ సమయంలో వాంతులుకూడా అవుతాయి. తలపోటు వెనక భాగంలో వస్తుంది ఆ సమయంలో తల ఇటు అటు కదిపితే చాలా బాధగా వుంటుంది. తల కదుపుతుంటే లోపల ఏదో పట్టివేసినట్లు వుంటుంది. కుడిచెవివెనుక ఎముక కొంచెము నెప్పి పెడుతుంది. నడుస్తుంటే కాలిమడమ ఆనినప్పుడల్లా బాధ ఎక్కువగా వుంటుంది. 'సైనస్ ట్రబుల్' అనుకొని ఎక్స్‌రే తీసి తర్వాత అది కాదన్నారు. గొంతు పరీక్ష చేసి 'అవిల్' మాత్రలు ఇచ్చారు.

తలపోటు క్రమబద్ధంగా రావటానికి ముఖ్యంగా మెదడు మీది పొరలలో ఉండే— 'అరాక్నాయిడ్' పొరక్రింది— "సెరిబ్రోస్పైనల్ ఫ్లూయిడ్' యొక్క చలనంలో రాగల వ్యారుపు దృష్టిలోపం, మానసికంగా అలసిపోవటం మొదలయినవాటివల్ల, జరుగుతుంది.




"దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్'' అని గురజాడ-అప్పారావుగారు చెప్పారు. ఆ విధంగానే గృహమంటే తలుపులూ, ద్వారాలూ ఉండి, నివాస యోగ్యంగా ఉన్న ఇల్లు కాదనీ, ఆ యింటిని సరియైన స్థితిలో ఉంచే గృహిణియే అని మన పెద్దలు ఎన్నో వేల యేళ్ల క్రిందటనే తెలియజేశారు.

ఇంటిలో ఇంటి యజమానురాలు ఉంటే ఆ యిల్లు కలకలలాడుతూ ఉంటుంది ఆమె లేని యిల్లు కళాకాంతులు లేనట్లే కనబడుతుంది.

గృహిణి ఇంటిపనులు నెరవేర్చుకోవడం, వంటా, వార్పులూ చూచుకోవడం, బిడ్డల పరిరక్షణ బాధ్యత వహించడం మాత్రమే కాకుండా పసితనం నుంచీ పిల్లల విజ్ఞానానికి దోహదం చేస్తూ ఉంటుంది. ఇది భారతీయులలో సర్వే సర్వత్రా కానవస్తుంది. ఆయా విషయాలకు సంబంధించిన కథలను చెప్పి బిడ్డలలో నీతి, నియమాలకూ, దైవభక్తికీ, విజ్ఞానానికీ తల్లియే అంకురం వేస్తుంది. పిల్లలు తండ్రులలో కంటే తల్లులతోనే ఎక్కువ కాలం గడపడంవల్ల మాతృ సాన్నిహిత్యమే వారికి ఎక్కువ. స్వామి వివేకానందుడు మున్నగు మహాపురుషుల విజ్ఞానానికి వారి తల్లులు శైశవంతో ఇచ్చిన దోహదమే కారణమని వారి వారి చరిత్రల వలన తెలుస్తున్నది.

నాగరకత అభివృద్ధి కాను కాను, తల్లికీ, పిల్లలకూ ఉండే అనుబంధం తగ్గిపోతున్నది. డబ్బున్న వారిలో ఇది స్పష్టంగా గోచరిస్తున్నది. భార్యాభర్త లిద్దరూ ఉద్యోగాలు చేస్తున్నప్పుడు పసిబిడ్డలను హాస్టలులకు అప్పగించి; వారాని కొకసారో, రెండుసార్లో వారిని చూచి తృప్తిపొందడం జరుగుతున్నది. ఆ బిడ్డలు పెద్దవారయిన తర్వాత తలిదండ్రుల యెడల ప్రేమ లేకపోతే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు

అట్టి తల్లుల యెడల 'గృహిణీ గృహముచ్యతే' అనే ఆర్యోక్తి వర్తించనే వర్తించదు.

తమ బిడ్డల శ్రేయస్సుకోరే తలిదండ్రులు పయి విషయాలను గుర్తించి తమ పిల్లల భవిష్యత్తుకోసం చిన్నప్పుడే తగిన జాగ్రత్తలను తీసుకోవలసి ఉంటుంది.

# అవీ ఇవీ అన్నీ

## సౌందర్యా కల్చరల్ సంస్థ విజయవాడలో మ్యూజికల్ నైట్

కిషోర్‌కుమార్ పాటలు ఆర్. డి. బర్మన్ ఆర్కెస్ట్రా వీటిని మాస్టర్ చేసిన మద్రాసులోని 'సుప్రీమ్స్' అనే సినిమా పాటల కచేరీలు చేసే బృందంవారు నవంబరు 23న విజయవాడలో సౌందర్య కల్చరల్ ఆర్గనైజేషన్ ఆధ్వర్యాన మూడు గంటల సేపు బోలెడు హిందీ పాటలు అచ్చం అసలు రికార్డులలాగా పాడి వినిపించారు. ప్రమోదకుమార్, రుక్మిణి, త్యాగరాజు, శంకర్, విజయలక్ష్మి ముఖ్యులుగావారి చేత యీ కచ్చేరీ ఏర్పాటుచేసిన సౌందర్య కల్చరల్ సంస్థకి వై. రామచంద్రరావు కన్వీనరు. ఉనికి కూడా అదే రోజు వర్ధమాన తార సంగీత ప్రారంభోత్సవం చేసింది. వీరు ఆ రోజున దర్శకులు సి. ఎస్. రావు, దాసరి నారాయణరావులను నటులు రంగనాథ్, సంగీతంలను కాట్రగడ్డ నరసయ్య, నేరెళ్ల లక్ష్మణరావులను విడివిడిగా సన్మానించారు ఎంతో మంది యువ మిమిక్రీ కళాకారులు యీ వేదికపై తమ తమ మిమిక్రీ చాతుర్యాన్ని ప్రదర్శించివేలాది ప్రేక్షకులరంజింపచేశారు.(ఒ.వి.)

### డాక్టరుగారి డైరీ

'కారుణ్య' రచించిన 'డాక్టర్‌గారి డైరీ' అనే వైద్యవిజ్ఞాన వ్యాస సంపుటం మా కార్యాలయం చేరింది. 130 పుటలు గల యీ పుస్తకం చక్కని ముఖచిత్రంతో మొత్తం 22 వ్యాసాలలో కూడి ఉన్నది. ప్రచురణకర్తలు చైతన్య వేదిక,తెనాలి. వెల ఏడు రూపాయలు. "కారుణ్య" డా. పి. దక్షిణామూర్తి, కలం పేరు.

### విషనాగులు

సాంఘిక నాటకం. రచన "అభ్యుదయశ్రీ" 118 పేజీలు. వెల 5 రూపాయలు. ప్రతులకు ది గ్లాడెటా ఆర్ట్స థియేటర్స్ (రిజిష్టర్డు) బాలాజీరావుపేట, తెనాలి—2.

### ఇదా ప్రపంచం

ఖండకావ్యము. రచన: శ్రీ సాహిణి వేంకట లక్ష్మీపతిరావు 154 పేజీలు. వెల 6రూపాయలు. ప్రతులకు : రచయిత, మాపరింటెండింగ్ ఇంజనీరు, శ్రీశైలం ప్రాజెక్టు, శ్రీశైలం, కర్నూలుజిల్లా.

### వెండితెర

హైదరాబాద్‌నుంచి వెలువడుతోన్న సినిమా వారపత్రిక 'వెండితెర' మా కార్యాలయము చేరింది. సంపాదకుడు పి.ఎ.వి. శాండిల్య. వివిధ శీర్షికలుగల యీ పత్రిక వెల 75 పై.

## ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

### నమ్మూ నమ్మకపో

ఈవారం (21–11–75) ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని, శ్రీ ముద్దా రమేష్‌గారి 'నమ్మూ నమ్మకపో' నమ్మలేనంత సంభ్రమాశ్చర్యాలను కలిగించింది. కీర్తిశేషులైన మహనీయులు శ్రీ లింకన్—శ్రీ కెన్నడీల రాజకీయ ప్రవేశంలోనూ జీవిత పరమావధిలోనూ గల సమసంబంధ సామ్యాలు, వారి జీవిత సంఘటనలలోను కనబడటం చాల ఆశ్చర్యంగా వుంది ఇది కేవలం కాకతాళీయమా ? లేక ఆధ్యాత్మికమైన ఏకత్వం వుందా అనేభావం కలుగుతోంది.

ఏమయినా యీ 'కోయిన్సిడెన్సు'ను సేకరించిన శ్రీ ముద్దా వారికి "టు ఛీర్." ఇలాగే ఆ మధ్య ఎక్కడో చదివినట్లు బాగా గుర్తు, మహామహులు చాలమంది శుక్రవారం నాడు పరమపదించినట్లు. లింకన్ మరణించిన రోజు శుక్రవారం. జీసెస్ క్రీస్తు చనిపోయిన రోజు శుక్రవారం. మహాత్మాగాంధి హత్యగావించబడినది శుక్రవారం. కెనడీ హత్య జరిగింది శుక్రవారం.

లూథర్ 'కింగ్ షాట్ ఆన్' శుక్రవారం. శ్రీకృష్ణ పరమాత్ముడు దేహాన్ని చాలించినది శుక్రవారం. ఇటీవల జరిగిన 'షేక్ ముజీబ్' దారుణ హత్య గూడా శుక్రవారమే ?

గంధం బాలగంగాధరశర్మ. (నాసిక్)

## ప్రశ్నావళి

చదవకూడదను కొంటూనే ప్రశ్నావళి శీర్షిక నిమరింత శ్రద్ధగా చదివి, ఉడుకొన్కని ఉత్తరాలు వ్రాసే పాఠకులని చూస్తే ఆశ్చర్యం కలుగుతోంది. రామలక్ష్మి గారి సమాధానాల వెనుక వున్న ఆమె స్వచ్ఛమైన హృదయాన్ని, వివిధ సమస్యలపై ఆమె అభిప్రాయాన్ని, ఆవేదనన్నీ గమ

## ఉత్తరాలు

నిస్తే ఆ శీర్షిక నిరుపయోగం అనే భావన ఎవరికీ కలుగదు. మరింత ప్రముఖంగా ఈ సారి 'ప్రశ్నావళి' రెండవపేజీలోకి తెచ్చినందుకు సంతోషిస్తున్నాను.

సి. హెచ్. రామ్మూర్తి (పిఠాపురం)

## అట్టమీదబొమ్మ

28—11—75 ముఖచిత్రం జయశ్రీ చాలా అందంగా ఉంది. కొత్తతారల ముఖ చిత్రాలు పాఠకులనుఆకర్షించుచున్నవి. "బ్లాక్‌మెయిల్" "పరిష్కారం" రెండు కథలు చాలా బాగున్నవి.

ఎం. నిశాకరరెడ్డి

మంకమ్మతోట (కరీంనగర్)




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# అవకాశానికి అవసరమైనప్పుడు ధరించడానికి సాంప్రదాయక సౌందర్యంతో బట్టలు...





వైజయంతి మూవీస్

# ఎదురులేని మనిషి

నిర్మాత సి. అశ్వనీదత్ B.Sc., దర్శకత్వం బాపయ్య ఈస్ట్‌మన్ కలర్

లక్ష్మీ ఫిలింస్ alpana

LAKSHMI PUBS